జాతీయగ్రంథమాల.

అనుబంధరత్నావళి. 1.

# వోటు హక్కు - ఎన్నికల విధానము.

మదరాసు లోకల్ బోర్డు ఆక్టు 1930 సంవత్సరం ఎమెండుమెంటు ఆక్టు ననుసరించి 1932 ఫిబ్రవరి నెలలో వెలువడిన జి. ఒ. లతోసహా ప్రచురించడమైనది.

EDITER BY

శనివారపు సుబ్బారావు,

కొవ్వూరు, (పశ్చిమగోదావరిజిల్లా.)

సంపాదకులు:

శనివారపు సుబ్బారావు,

బాలాంత్రపు సత్యనారాయణరావు,

జాతీయగ్రంథమాల, పిఠాపురం.

వెల 6 అణాలు.

సర్వస్వామ్యములు

సంపాదకులవి.



మొదటికూర్పు.

ఏప్రియలు 1932.



శ్రీవైష్ణవ ముద్రాక్షరశాల,

పెంటపాడు.

# విజ్ఞాపన.

ప్రస్తుత పరిస్థితులనుబట్టి పౌరసత్వపు హక్కునుగురించి జనసామాన్యమునకు వెల్లడిపరచు నుద్దేశ్యముతో మా గ్రంథమాలలో యీ గ్రంథమును అనుబంధముగా ప్రచురించితిమి.

సంపాదకులు.

# విషయసూచిక.



# పీఠిక.

ఇంగ్లీషు పరిపాలనకు పూర్వము మన దేశము గ్రామ పంచాయితీలద్వారా పరిపాలింపబడినటుల ఆంగ్లేయ చరిత్రకారు లనేకులు వ్రాసియుండిరి. అట్టివారిలో మైన్, బాడన్ పవల్ వ్రాసిన గ్రంథము లతి ముఖ్యములై ఉన్నవి. 1687 సంవత్స రమున చెన్నపట్నము ఆంగ్లేయులు, భారతీయులు సమూహమైన నొక సంఘమువారు స్థానిక పరిపాలన ఏలా జరిపిన బాగుండు నను ఆలోచనలు జరిపిరి. ఆ యోచనాఫలితము 1870 సంవ త్సరమున మేయోప్రభువు పరిపాలనలో పట్టణములకు మ్యునిసి పాలిటీలను పేరిట నేర్పాటు గావింపబడెను. గ్రామములకు ఇదమిద్ధమనేది నిశ్చయం కాలేదు. 1882 సంవత్సరమున రిప్పనుప్రభువు పరిపాలనా కాలమున లోకల్ బోర్డ్సు ఆక్టు (స్థానిక సంస్థల చట్టము) నిర్మింపబడెను. కాని వీటియందు గవర్నమెంటు ఉద్యోగీయులు, గవర్నమెంటువారిచే నియ మింపబడ్డవారు (నామినేషను) ప్రజలలో వోటు యిచ్చుటకు హక్కున్నవారిచే ఎన్నుకోబడ్డవారు కలసిన సభ్యులతో ఏర్పడి యుండెను. 1919 సంవత్సరమున మాంటేగుచెలమ్సుఫర్డు ప్రభువువల్ల ఏర్పాటుకాబడిన సంస్కరణలవల్ల 1920 సంవత్సర మున మదరాసు గవర్నమెంటువారు గావించిన లోకల్ బోర్డ్సు ఆక్టునందు బోర్డులన్నియు ఎన్నికలచేతనున్ను వాటిని నిర్వహించు అధ్యక్షులు (ప్రెసిడెంట్సు) సభ్యులలోనుండి ఎన్నుకోబడవలె

ననియు, తక్కువ సంఖ్యాకులైన కులములవారికి నామినేషను వల్ల ప్రాతినిధ్య మిచ్చుటకు గలిగిన హక్కులతో ఏర్పడెను. గ్రామములకు గ్రామపంచాయితీ ఏర్పాటు చేసుకొనుటకు ప్రత్యేకముగ గ్రామపంచాయితీ ఆక్టు గావింపబడెను. లోకల్ బోర్డ్సు ఆక్టు సవరణలుచేయు హక్కు రాష్ట్రీయ గవర్నమెంటుకు గలదు. అందువల్ల 1922, 1925, 1927, 1930 సంవత్సరములలో చట్టమునందు సవరణలను చేసియుండిరి. 1930 సవరణ చట్టమునందు వేరే గ్రామ పంచాయితీకి ఆక్టులేకుండా పంచాయితీ, తాలూకా, జిల్లాబోర్డులకు కలిపి ఒకే చట్టమును ఏర్పాటు చేసిరి.

47, 48, 49 శెక్షనుల ప్రకారం పంచాయితీ, తాలూకా, జిల్లాబోర్డులకు వేటికివాటికే ప్రత్యేకముగా ఎన్నికల ఏర్పాట్లు కాబడియున్నవి.

7 వ శెక్షను ప్రకారం పంచాయితీబోర్డుకు 8 మొదలు 16 గురువరకు, తాలూకాబోర్డునకు 12 మొదలు 24 గురు వరకు జిల్లాబోర్డుకు 24 గురు మొదలు 52 వరకు గల సభ్యుల సంఖ్యతో బోర్డు లేర్పాటు కాబడవలెను.

8 వ శెక్షను ప్రకారం సభ్యులన్నవారంతా ఎన్నుకోబడవలెను.

9 వ శెక్షను ప్రకారం పంచాయితీబోర్డునకు ఆదిఆంధ్రులకు, తాలూకాబోర్డుకు ఆదిఆంధ్రులకు, భారతీయ క్రైస్తవు

లకు, మహమ్మదీయులకు, స్త్రీలకు ప్రత్యేకముగ కొన్ని స్థానములు ఏర్పాటు కాబడవలెను. జిల్లాబోర్డుకు ఆదిఆంధ్రులకు, భారతీయ క్రైస్తవులకు, మహమ్మదీయులకు, స్త్రీలకు, యూరపియనులకు, ఆంగ్లోఇండియనులకు, ప్రత్యేకస్థానములు ఏర్పాటు కాబడవలెను. యిట్టి ప్రత్యేక స్థానములన్నియు బోర్డుసభ్యుల మొత్తము సంఖ్యకు నాల్గవవంతుకు మించి యుండగూడదు.

వీరికై నిర్మింపబడ్డ ప్రత్యేకస్థానములలో ఆయాకులములవారే ఎన్నికకు నిలువవలెను కాని వారి స్థానములలో ఇతరకులములవారు నిలువగూడదు. వారుమాత్రం వారికొఱకు ఏర్పడ్డ స్థానములకుగాక తదితర స్థానములకు పోటీ చేయుటకు హక్కును గలిగియుండిరి.

ఓటర్ల జాబితాను లోకల్ గవర్న్మెంటువారు తయారు చేయుదురు.

51 వ శెక్షను ప్రకారం ప్రతి వత్సరం [illegible] ఖములోగా వోటర్లజాబితా తయారు చేయబడవలెను.

11 వ శెక్షను ప్రకారము ఎన్నికోబడిన సభ్యుల కాల పరిమితి 3 వత్సరము లుండును. ఆ మూడు వత్సరముల పరిమితి 1 నవంబరు తేదీతో ఆఖరు [illegible] అంటే ప్రతి మూడు వత్సరములకు జరిగే సాధారణ (జనరల్) ఎన్నికలు నవంబరు 1వ తేదీలో పునఃపూర్తి కావలెను. మధ్యవచ్చే ఖాళీలు (చనిపోవుటవల్ల, రాజీనామా దాఖలుచేయుటవల్ల,

తదితర కారణములవల్ల) యెపుడు పూ_ర్తిచేసినను అఖాళీ వేసిన స్థానములోని అసలు సభ్యుడు యెన్నుకోబడ్డ తేదీ లగాయితు 3 వత్సరముల లెఖ్క_ ప్రకారం మధ్య వచ్చిన ఖాళీలో ఎన్నుకోబడ్డ సభ్యుని కాలపరిమితికూడ పూ_ర్తికాగలదు.

నెం 11 రు 1930 చట్టప్రకారము రూపాయకు అణాన్నర చొప్పున (0-1-6 పైసలు) భూమిపన్నునుండి లోకల్ సెస్సుగా ప్రత్యేకింపబడుటయు యీ అణాఆరుపైసలలో 3 పైసలు పంచాయితీకి 6 పైసలు తాలూకాబోర్డుకు, 6 పైసలు జిల్లాబోర్డుకు, 3 పైసలు విలేజి డెవలెప్‌మెంటుఫండు అను పేరిట ప్రత్యేకింపబడుటకు నిశ్చయింపబడినది.

స్వాతంత్ర్యముగల దేశములలో స్త్రీపురుష భేదము లేకుండ 21వ వత్సరం ప్రాయముగల ప్రతివానికి వోటు యిచ్చుటకు హక్కున్ను (ఎడల్టుఫ్రాంచైజు) లోకల్ సెల్ఫు గవర్నమెంటునకే (స్థానిక పరిపాలనా సంస్థలకే) పోలీసు, న్యాయశాఖలలో స్థానికముగ నున్నవాటిపై అధికారమున్ను, ఆర్థికముగ స్థానిక పరిపాలనకు పన్నులలోనుండి యెక్కువ భాగము సొమ్ము వచ్చుటకు ఏర్పాట్లున్ను గలవు. అట్టి ఏర్పాట్లు మనదేశమందు కూడ త్వరలో వచ్చుటకు పరిపాలనా విధానములో మార్పు చేయవలసియున్నది. అందులకు వోటర్లు, ప్రజలు ప్రయత్నింపవలసియున్నది.

స్వాతంత్ర్యముగల దేశములతోపాటు మనదేశముగూడ నుండవలెనసియు స్వేచ్ఛకోసమున్న యితరదేశములలోని స్థానిక

పరిపాలనవలె మనదేశములో కలుగవలెనని కోరువారిలో ప్రజాసేవయే భగవత్సేవయని నమ్మి నిష్కల్మషహృదయముతో సేవ చేయువారినే వోటర్లు తమ ప్రతినిధులుగ యెన్నుకొనుట కెల్లప్పుడు ప్రయత్నించుచుండెదరుగాక !

తెలుగున యింతవరకు లోకల్ బోర్డ్సు ఆక్టు తూర్పు గోదావరిజిల్లా కపిలేశ్వరపురం కాపురస్థులు శ్రీ చాగంటి శేషయ్యగారున్ను (వెల రు 4 లు) చెన్నపురిలో సైదాపేటలోనున్న శ్రీ సి. వి. నాయుడు అడ్వకేటుగారున్ను (ప్రస్తుతం చెంగల్పట్టు జిల్లాబోర్డ్సు జిల్లా పంచాయితీల ఆఫీసరు) (వెల రు 7 లు మొదటి వ్యాల్యూము) వ్రాసియుండిరి.

ఆక్టు అమలాగ్రముగ తెలిసికోగోరువారు వాటిని చదువవలెను. వోటరుగా నుండుటకున్ను వోటు నిచ్చుటకున్ను సభ్యుడుగా నుండుటకున్ను కావలసిన అంశములన్నియు ప్రతి పౌరుడు తెలిసికోవలసి యున్నది. అందులకై అందరికి అందుబాటులో నుండుటకై అందులకు సంబంధించిన శెక్షనులను, వాటికి సంబంధించిన జీ. ఓ. లను చేర్చి యీ చిన్న పుస్తము నందు వ్రాయబడియున్నవి.

కొవ్వూరు,
పశ్చిమ గోదావరి జిల్లా.
1-4-1932.

శ॥ సుబ్బారావు.

# సూచిక.

## లోకల్ బోర్డ్సు ముఖ్యవిధులు.

విద్యావ్యాపకము (గ్రంథాలయములు, పఠనమందిర ములు, వృత్తిపాఠశాలలు, బోధనాతరగతులు, రాత్రి పాఠ శాలలు, కొన్ని ఋతువులందే ఏర్పాటుచేయు పాఠశాలలు, తాత్కాలిక పాఠశాలలు, ప్రాథమిక, మాధ్యమిక, శకండరీ పాఠశాలలు మున్నగువాటి ఏర్పాటు విద్యాభవనముల నిర్మా ణము, మఱమ్మతులు, పాఠశాలల తనిఖీచేయుట వగైరా పనులు) బీదలకు, అనాథులకు శరణాలయములు, వైద్యసౌక ర్యములకై ఔషధశాలలు, పశువైద్యాలయములు, సత్ర ములు, బాటసారుల కేర్పడ్డ ఛంగాళాలు, విశ్రాంతి భవన ములు, సంతలు, కసాయిదుకాణములు, బండ్లనిలువు ప్రదేశ ములు, మురుగునీరు పోవుటకు, మంచినీటి సౌకర్యములు, మరుగుదొడ్లు, రహదారీ సౌకర్యములు, ఆరోగ్యమునకై టీకాల ఏర్పాట్లు, మంత్రసానుల ఏర్పాట్లు, ఇండ్లకు నివేశస్థలములు, మున్నగు వాటికై లోకల్ బోర్డులకు వశపరుపబడిన ధనమును వినియోగింపవచ్చును. అట్టి పనుల నిర్వర్తించు కార్యాలయ ములవారికి ధర్మము చేయవచ్చును.

ఏపనిని గావించినను బోర్డు సభ్యులచే తీర్మానము గావిం చిననేగాని చెల్లనేరదు. అట్టి తీర్మానములపై విమర్శనాధి కారం స్థానిక గవర్నమెంటుకు గలదు.

# వోటు.

52 వ, శెక్షను. (ఎ) బ్రిటిషు ఇండియాలోగాని, ఇండియాలోని ఏ సంస్థానములోగాని జన్మించి యుండవలెను. విదేశీయులకు, పరాయి జాతివారికి స్థానిక గవర్నమెంటు (రాష్ట్రీయ గవర్నమెంటు) వోటరుగా నుండుటకు అనుమతి నియ్యవచ్చును.

[వోటరుగా రిజష్టరు కాబడుటకు కావలయు సాధారణవిధులు.]

(బి) వోటర్ల జాబితా ప్రచురింపబడునాటికి గత వత్సరములో ఇరువదిఒక్క సంవత్సరం వయస్సు వచ్చి యుండవలెను.

(సి) మూడవ షెడ్యూలు—వోటర్ల అర్హతలు.

(ఎ) ఇండియా గవర్నమెంటుకుగాని, రాష్ట్రీయ గవర్నమెంటుకుగాని, రాష్ట్రములోని ఏ స్థానికాధికారికైనను తాను చెల్లింపవలసిన పన్నులలో ఆదాయపుపన్ను (ఇన్‌కంటాక్సు) భూమిపన్ను (లాండుసెస్సు) వృత్తిపన్ను (ప్రొఫెషినల్‌టాక్సు) ఇంటిపన్ను (హౌసుటాక్సు) గత వత్సరములో విధింపబడినది చెల్లించి యుండవలెను.

వివరము :—సెస్సులు, సుంకములు పన్నులక్రింద చేరవు. ఏమాత్రము సొమ్ము పన్నుగా చెల్లించినను వోటరుగా నుండుటకు అర్హత కలదు. యింత సొమ్ము చెల్లించితీరవలెనను నియామకము లేదు.

(బి) రైతువారీ పట్టాదారుగాగాని, (జిరాయితీ పట్టాదారు)యీనాందారుగాగాని వోటరుకాబడు ప్రదేశములో నుండవలెను. (జిల్లాబోర్డుకు వోటరుగానుండవలెనంటే జిల్లాలో నెక్కడైనను, తాలూకాబోర్డుకు తాలూకాలో నెక్కడైనను పంచాయితీబోర్డుకు గ్రామములోను భూమిపట్టా నుండవలెను.) లేదా,

(సి) గ్రామ, తాలూకా, జిల్లాలోనున్న జిరాయితీదారు వద్దగాని, యీనాందారువద్దగాని, లేక అట్టి పట్టాదారుక్రింద నుండెడి రైతువద్దగాని వ్రాతమూలకముగా పొందిన కౌలుగాగాని, యిజారాగాగాని భూమికి హక్కును కలిగియుండవలెను. లేదా,

వివరము :—సర్కారు జిరాయితీ యీనాం భూకామందులవద్ద కౌలుకు తీసుకున్న రైతువద్ద మరో కరు లోపాయికారీగా తీసుకున్న కౌలుదారు వోటరుగా నుండవచ్చును.)

(డి) మనకు వర్తింపదు. అందువల్ల వ్రాయలేదు.

(ఇ) 1908 సంవత్సరం మదరాసు ఎస్టేటు ల్యాండు ఆక్టు ననుసరించి గ్రామ, తాలూకా, జిల్లాలో జమిందారుగా (ఎస్టేటుదారు లేక భూస్వామి) నుండవలెను. లేదా,

వివరము :— జమిందారీ జిరాయితీ పట్టాదార్ల వద్ద కౌలుకు పుచ్చుకొన్న లోపాయికారీ కవులుదారు వోటరుగా నుండుటకు వీలులేదు.

(ఎఫ్) 1908 సంవత్సరపు మదరాసు ల్యాండు ఎస్టేటు ఆక్టు ననుసరించి గ్రామ, తాలూకా, జిల్లాలో భూమిని కలిగియున్న రైతువద్దగాని, భూకామం దువద్దగాని, కౌలుదారుగాగాని యుండవలెను. లేదా,

వివరము :—(సి) కి వ్రాసిన వివరమే యిక్కడ వర్తించును.

(జి) చక్రవర్తిగారి (గవర్నమెంటు లేక ప్రభుత్వపరిపాలకులు) సైన్యశాఖలో (మిలటరీ) అందుండి గవర్నమెంటువారి అనుమతిపై చాలించుకొన్నను, ఫించను తీసుకొనుచున్నను, లేక గవర్నమెంటువారే వారి వ్యమమీద పంపివేసినను, అట్టివారిలో నాన్‌కమీషను ఆఫీసరుగా పనిచేసిన ఉద్యోగిగాని సైనికుడుగా నున్నవానికి వోటరు హక్కుగలదు.

వివరము :—ఈ రూలు 52, 53 శెక్షనులకు అనుబంధముగా నుండునట్లు ఎంచుకోవలెను. గత వత్సరం పన్ను చెల్లించియుండవలెను. లేదా విధింపబడి యుండిన చాలును. ఆ విధింపబడినది చెల్లించి యుండనక్కర లేదు.

3. కంపెనీగాని, సంఘంగాని, (ఎసోసియేషను) సమిష్టి కుటుంబముగాని, ఉమ్మడిపట్టాదార్లుగాని వారు చెల్లించుపన్నుకు వోటు హక్కుండును. యీ వోటు నెవరిద్యావలెనన్న కం

పెనీ లేక సంఘముయొక్క కార్యదర్శిగాని లేక కంపెనీసంఘము నడుపువారివల్ల అధికారము పొందిన మరెవరుగాని, సమిష్టి కుటుంబమైన ఉమ్మడి పట్టాదార్లందరివద్దనుండి అధికారము తీసుకొబడినవారుగాని, వోటరుగా నుండుటకు హక్కుగలదు. లేదా వాటి యజమాని (మేనేజరు) వోటరుగా నుండును. ఉమ్మడి పట్టాదార్లు వోటరుగా నుండేవానిని నిర్ణయించని పక్షములో మొదటి పట్టాదారునిపేరే వోటర్లజాబితాలో చేరును.

4. స్వంతగానుంచుకున్న వోటు హక్కుగాక కంపెనీ, సంఘము, సమిష్టికుటుంబములవల్ల వేరే వోటరు హక్కును గలిగియున్నను ఒక్క వోటునే ఉపయోగించవలెను గాని రెండును ఉపయోగించ వీలులేదు.

5 3వ నిబంధనలోని హక్కుగాక స్వంతంగా వోటరుగా నుండవలెనంటే పైన వివరించిన తదితర నిబంధనల ప్రకారం వోటరుగా నుండుటకు అర్హతను కలిగి యుండవలెను.

(డి) తాలూకా, జిల్లాబోర్డులలో వోటరుగా నుండుటకై ఆయా ప్రదేశములలో గత సంవత్సరంలో మొత్తంమీద 120 రోజులు నివాసముగా నుండితీరవలెను. ఆ తాలూకా, జిల్లా ప్రదేశమునకు మూడుమైళ్ల దూరములోగల నొక మ్యునిసిపాలిటీనందుగాని (మదరాసు కార్పరేషనుసహా) ఒక కాంటెన్మెంటునందుగాని (సైనికులుండేచోటు) నివసించి యుండవలెను. కాని యిట్టి ప్రదేశమునందు కాపురమున్నంత మాత్రమున అక్కడివారికి (మ్యునిసి

పాలిటీకి) పన్ను చెల్లించిననేగాని వోటరుగా నుండరాదు అను విషయము యీ నిబంధనకు వర్తింపదు.

(ఇ) పంచాయితీకి వోటరుగా నుండుటకు గత వత్సరములో ఆగ్రామమందు మొత్తంమీద 120 రోజులు నివసించి యుండవలెను.

53 వ శెక్షను. [వోటర్ల అనర్హతలు.] 51 వ శెక్షను ప్రకారము అందు 5 వ సబు శెక్షను ప్రకారంగా వోటరుగా నుండుటకు హక్కును గలిగి యుండవలెను.

యీ దిగువను యీ శెక్షను వివరింపబడెను.

51 వ శెక్షను. [వోటర్ల జాబితా.] (1) ప్రతి బోర్డు ఎన్నికలకు వోటర్లుగా నుండ సర్హులైనవారి పేర్లతో నొక జాబితాను ప్రచురింతురు. జూను నెలాఖరులోగా యిట్టి జాబితాను ప్రకటింపరాదు.

(2) జూను నెలాఖరులోగానే ఆ జాబితాకు సంబంధించిన సవరణలుకూడ జరుపబడి యుండవలెను.

(3) తాలూకా, జిల్లా బోర్డులకు తయారైన వోటర్ల జాబితాలో ఆయా తాలూకా, జిల్లాబోర్డుల కేర్పడ్డ సర్కిళ్ల ప్రకారం ఆయా సర్కిళ్ల ననుసరించే వోటర్ల జాబితా తయారగును. గ్రామ పంచాయితీ వార్డులుగా విభజింపబడిన పక్షమున ప్రతి వార్డునకు వోటర్ల జాబితా తయారు అగును.

(4) ఒకసారి తయారైన వోటర్లజాబితా మరల క్రొత్తగా తయారు అగువరకు అమలులో నుండును.

(5) వోటర్లజాబితా సవరణలతో సహా ప్రచురింపబడినదానిలోనున్న వోటర్లంతా ఎన్నికలలో వోటు నిచ్చుటకు ఆజాబితా అమలులో నున్నంతవరకు హక్కు గలదు. అందు పేరులేనివారు వోటు నియ్యగూడదు.

పైన వివరించిన 5 వ సబు శెక్షను ప్రకారము హక్కును గలిగియున్నను మనస్సు స్థిమితం లేకపోవుట (పిచ్చి) చెముడు, మూగ, కుష్టు గలవారికి మాత్రం 51 వ శెక్షను 5 వ సబు శెక్షనులోని హక్కు వర్తింపదు. అందువల్ల అట్టి రోగులు వోటియ్యగూడదు.

వివరము :—దిద్దుబాటైన వోటర్లజాబితాలో తప్పులున్న అట్టి పేర్లుగలవారు గుర్తుమీద వోటు నిచ్చుటకు ఎన్నికకు నిలచుటకు హక్కు గలదు వోటర్ల జాబితా ప్రచురణ అయినప్పటికి పైనవ్రాసిన రోగములు సంభవింపవచ్చును. పిచ్చి ఎత్తినదని డాక్టరు ఋజువు చేయవలెను. కేవలము, చెముడుగాని, మూగగాని వున్నంత మాత్రమున అవి అనర్హత కాజాలదు. ఈ రెంటును చేరియున్నవారైనను డాక్టరుచే ఋజువు చేయవలెను. మనస్థిమితము అనే జబ్బును ఎలక్షను ఆఫీసరుచే ప్రత్యేకంగా నిర్ణయం కాబడవలెను. ఇట్టి జబ్బున్నదని వాదించువాడే ఆ విషయమును గురించి ఋజువు చేసుకోవలెను.

59 వ శెక్షను. [ఎలక్షను రూల్సును వ్యతిరేకింపబడి యుండి అట్టి రూల్సుకు తగిన శిక్షలను పొందినవారు వోటిచ్చుటకు ఎన్నికకు నిలబడుటకు అనర్హుడు.]

58 వ శెక్షను ప్రకారంగా అనర్హుడు గావున ఆ శెక్షను యీదిగువ వివరింపబడెను.

58 వ శెక్షను. ఎవరైనను ఏవిషయమైనను ఎన్నికకు నిలబడినవారిని గురించి పరోక్షమునో ప్రత్యక్షముననో ఏదైనా ఎన్నికకు సంబంధించిన రహాస్యమును బయలుపరచిన యెడల అట్టివానిని గురించి పోలింగు ఆఫీసరు లేక గుమాస్తా, లేక అట్టి పనిని చూచుటకు ఏర్పడ్డ సరొక అధికారిగాని కేసు పెట్టవచ్చును. ఆ కేసులో 6 నెలలువరకు శిక్షను విధింపవచ్చును. జుల్మానా విధింపవచ్చును. రెండును గాని రెంటిలో ఏదిగాని విధింపవచ్చును.

వివరము :—వోటిచ్చినవారి పేర్లు బయలుపరచినను పోలింగు ఆఫీసులో వోటిచ్చుటకు ప్రోద్బలము చేసినను బలవంతపరచినను మొన్నగునవి నేరముల క్రిందనే వచ్చును.

59 వ శెక్షను. 58 వ శెక్షను ప్రకారం ఇండియను పినల్ కోడ్డు 9 వ ప్రకరణ (ఎ) భాగంరీత్యా ఎన్నికల రహాస్యమును బయలుపరచినందులకు పోలింగు ఆఫీసరు చే నేరము మోపబడి శిక్షింపబడినవారు శిక్షాకాలమునుండి 5 వత్సరములు లేదా కోర్టువారు నిర్ణయించినంతకాలము (అంతకులోపు)వరకు వోటు నియ్యవీలు లేదు. ఎన్నికకు నిలువ వీలులేదు.

వివరము :—శిక్షాకాలము పూర్తిఅయిన తరువాత యిది అమలులో నుండదు.

**జి. ఓ. నెం 2413 రు యల్. అండు యమ్. 7 జూలై 1931.**

7 (బి) ఎలక్షను ఆఫీసరు ఏప్రియలు నెల దాటకుండా చిత్తు వోటర్లజాబితాను ప్రకటించవలెను. అందరికి వెల్లడి అగుటకై మొత్తం జాబితాను, తాలూకా, జిల్లాబోర్డుల ఆఫీసులలోను, తాలూకా, డిప్యూటీ తహశ్శీల్దారు ఆఫీసులందును బహిరంగపరుపవలెను. ఏగ్రామానికి సంబంధించినది ఆగ్రామ పంచాయితీఆఫీసు లేక చావడినందు లేక అందరికి వెల్లడియగు తదితర బహిరంగ ప్రదేశమునందు బహిరంగ పరుపవలెను.

(సి) చిత్తు వోటర్లజాబితాలో ఎవరిపేరైనను పడక పోయినను, అక్షరముల పొరబాటుతో పడినను, వోటరుగా నుండుటకు అర్హత లేనివారి పేర్లుపడినను అట్టి విషయములను గురించి దరఖాస్తులు ఎలక్షను ఆఫీసరునకు పంపుకోవలెను. ఎచ్చోటకు, ఏ తేదీలోగా దరఖాస్తులు పంపుకోవలెనో అట్టి దరఖాస్తుల విచారణ ఎచ్చోట యెప్పుడు జరుగునో అను వివరములు 15 జూను దాటకుండా ఎలక్షను ఆఫీసరు నిర్ణయింప వలెను. వోటర్లజాబితా ఏలాగ నుండుననుటకు నెం 1 రు ఫారము నెం 2 రు ఫారము పేర్లు చేర్చుటకు, దిద్దుబాట్లు చేయుటకు, నెం 4 రు ఉన్నపేర్లను తొలగించుటకు, ఏర్పడి యున్నవి. యీ ఫారములలో 3, 4 నెంబర్ల ఫారములు ఎలక్షను ఆఫీసరువద్ద, గ్రామ, తాలూకా, జిల్లాబోర్డులవారివద్ద దొరకగలవు. వీటిని ఉచితముగా యిత్తురు.

ఇట్టి దరఖాస్తులు స్వయముగాగాని, తపాలాద్వారా గాని, మనిషిద్వారాగాని, ఎలక్షను ఆఫీసరు నియమించిన

గడవులోపున (అనగా చిత్తు జాబితా ప్రచురణ తేదీకి 30 రోజులలోపున) వారికి అందచేయవలెను.

సరియైన నమోనా ఫారములలో లేకపోయినను సరియైన కాలములో పంపకపోయినను వాటిని ఎలక్షను ఆఫీసరు నిరాకరింపవలెను.

(డి) వోటర్లజాబితాను ఏ ఎన్నికలకు సంబంధించినవి వాటిని కొనుక్కొనుటకు ఎలక్షను ఆఫీసరువద్దగాని, పంచాయితీ, తాలూకా, జిల్లాబోర్డు ఆఫీసులలోగాని దొరకును.

(ఇ) ఎలక్షను ఆఫీసరు ఎచ్చోటకు ఏ తేదీకి విచారణకై దరఖాస్తులు పంపవలెనో అనునదియు ఎచ్చోట ఏ తేదీని విచారణ చేయునదియు ప్రజలందరికి వెల్లడి అగుటకై తాను స్థానికంగా వాడబడే ప్రధానభాషలో వెలువడే కొన్ని వార్తాపత్రికలలో ప్రకటన చేయవలెను.

(9) చేరినదరఖాస్తులను విచారణచేసి తీర్పులనుచెప్పవలెను.

(10) దరఖాస్తుదార్లలో అభ్యంతరపెట్టినవాటినిగురించి వుభయపక్షములవారికి సమనుచేసి విచారణ చేయవలెను.

(11) (ఎ) ఒకేరోజున విచారణ కానిపక్షమున మరొక తేదీకి వాయిదా వేయవచ్చును. విచారణ తీర్పు దరఖాస్తుల మీాదనే ఎలక్షను ఆఫీసరు వ్రాయవలెను. వాటిపై అపీలు చేసుకొనుటకు దరఖాస్తుదార్లకు హక్కు గలదు.

(బి) విచారణలకై గ్రామాధికారు లవసరమని తోచినచో ఎలక్షను ఆఫీసరు వారిని హాజరు పరుచుకోవచ్చును. రూల్సు ప్రకారం వారికి భత్యఖర్చులు యియ్యవలెను.

(12) (1) ఎలక్షను ఆఫీసరు విచారణ అన్యాయమని తోచిన పక్షమున తీర్పు చెప్పిన 5 రోజులలోగా ఎలక్షను ఆఫీసరుద్వారానే అపీలు అధికారికి నెం 6 రు ఫారముగా వ్రాసి అపీలు చేయవచ్చును.

(2) అపీలు అధికారికి ఎలక్షను ఆఫీసరు అందుకు సంబంధించిన కాగితములు పంపును. అపీలు అధికారి తీర్పే ఆఖరు తీర్పుగా పరిగణింపబడును.

వివరము :—కోర్టుకుకూడా వెళ్లవచ్చును.

(14) ఎలక్షను ఆఫీసరువద్దకుగాని, అపీలు అధికారి వద్దకుగాని స్వయంగాగాని లేక తమ తరపున ఏజంటునుగాని పంపవచ్చును. ఏజంటును పంపు పక్షములో వ్రాతమూలక ముగ వ్రాసి ఫలానివారిని పంపుచున్నానని తెలుపవలయును.

(15) అవసరమని తోచిన ప్రమాణకంమీాద ఎలక్షను ఆఫీసరు విచారణను గావింపవచ్చును.

(16) (ఎ) ఎలక్షను ఆఫీసరు సవరణచేసిన వోటర్ల జాబితాను 30 జూను లోపుననే ప్రచురింపవలెను.

(బి) 30 జూను అనంతరం అపీలు అధికారినుండి చేర్చమనిగాని తీసివేయుమనిగాని వచ్చే జాబితాను చేర్చుకోవలెను.

(18) పైనవివరించిన రూల్సుకు వర్తించకుండా వోటర్ల జాబితాను అధికార్లు తయారు చేసిన పక్షమున ఏవోటరైనను వాటిని గురించి అభ్యంతరపెట్టుటకు హక్కు గలదు.

## నెం 1 రు ఫారము.

## వోటర్ల జాబితా నమోనా.

జిల్లాబోర్డు సర్కిలు,

తాలూకాబోర్డు సర్కిలు.

పోలింగు ప్రదేశము. పోలింగు స్టేషను.

| వరుస నెంబరు. | పేరు. | తండ్రి లేక కరన వాన్ను (గార్డియను) లేక భర్త పేరు. | విలాసం గ్రామము. | అర్హతలు. |
|---|---|---|---|---|
| | | | | |

వోటర్లజాబితా పంచాయితీ తాలూకా

పార్టీ వార్డు నెం.

| వరుస నెంబరు. | పేరు. | తండ్రి లేక కరన వాన్ను (గార్డియను) లేక భర్త పేరు. | విలాసం వీధి, తలుపు నెంబరు లేక శివారు గ్రామం. | అర్హతలు. |
|---|---|---|---|---|
| | | | | |

## నెం 3 రు ఫారము నమోనా.

వోటర్లజాబితాలో నమోదు కాబడినది దిద్దుట / చేర్చుట కొరకు దరఖాస్తు.

To

ది ఎలక్షను ఆఫీసరుగారికి.

అయ్యా,

నా పేరు సవరించుకొనుటకు / నా పేరు చేర్చుకొనుటకు వోటర్లజాబితాలో

పంచాయితీ / తాలూకాబోర్డు / జిల్లాబోర్డు నాకు హక్కు గలదని యిందుమూలముగా తెలియబరచుకొనుచున్నాను.

| హక్కుదారుని పూర్తి పేరు తండ్రి లేక కర్నవాన్సు (గార్డియను) లేక భర్తపేరు. | విలాసము గ్రామము లేక వీధి, ఇంటి నెంబరు. | ఏవిధముగా అర్హత గలిగినది. | చెల్లించుపన్ను లేక అద్దె విలువ (కాలం) |
|---|---|---|---|
| | | | |

నేను బ్రిటిషు ప్రభుత్వమునకు లోబడియున్నాను. నేను ______

ఇండియాలోనున్న ______ స్టేటునకు లోబడియున్నాను.

నేను పరాయి దేశస్థుడైనందున 52 శెక్షను (ఎ) మదరాసు ______

లోకల్ బోర్డుఆక్టు 1920 ప్రకారం నాకు 21 సంవత్సరం వయస్సు ______

తేదీనాటికే వచ్చినది. నేను తెలియబరచేదేమనగా ______

నేను చట్టనిబంధనల ననుసరించి ______ పంచాయితీ ______

ఆవరణలో ______ తాలూకాబోర్డు ఆవరణలో లేక ______

______ మ్యునిసిపాలిటీ / కాంటోన్మెంటు 3 మైళ్లలోనున్న తాలూకా ఆవరణలో

______ జిల్లాబోర్డు ఆవరణలో లేక ______ మ్యునిసిపాలిటీ / కాంటోన్మెంటు

నకు 3 మైళ్లలోనున్న జిల్లాబోర్డు ఆవరణలో నివసించుచున్నాను ______

గాపున ఈ ఆక్టులో 3 వ షెడ్యూలులోని నిబంధన ప్రకారం

నేను అర్హతను కలిగియున్నాను.

తేది

దరఖాస్తుదారుని సంతకం.

నెం 4 రు ఫ రము న మోనా.

న మోదుకు అభ్యంతర పెట్టు దరఖాస్తు.

To

ఎలక్షను ఆఫీసరుగారికి.

అయ్యా,

నేను ఇందుమూలముగా తెలుపు అభ్యంతర మేవసగా

నా పేరు / ఇతరుల పేరు యీాదిగువ వివరించిన ప్రకారం వోటర్ల జాబితాలో,

వార్డు / సర్కిలు / సర్కిలు — పంచాయితీ / తాలూకాబోర్డు / జిల్లాబోర్డు

| అభ్యంతర పెట్టువాని పేరు. | చిత్తు వోటర్ల జాబితాలోనున్న నెంబరు. | అభ్యంతరమునకు కారణము. |
|---|---|---|
| | | |

తేది

చిరునామా — అభ్యంతరదారు సంతకం.

గ్రామము వార్డు / సర్కిలు / సర్కిలు నెం రు వోటర్ల జాబితాలో

## నెం 6 ఫారము నమోనా.

## ఎలక్షను ఆఫీసరు ఉత్తర్వుపై అపీలు నమోనా.

To

గారికి.

Through

జిల్లా ఎలక్షను ఆఫీసరుగారి ద్వారా

అయ్యా,

నేను తమకు తెలుపుకొనేది ఏమనగా                    తేదీని ఎలక్షను ఆఫీసరుగారిచ్చిన తీర్పుపై అపీలు చేసుకొనుచున్నాను.

ఎలక్షను ఆఫీసరుగారి తీర్పునందు ఈ క్రింది విధమున అంశములు గలవు.

2. నా అపీలునకు యీ దిగువ కారణములు గలవు.

3. నా కారణములను విచారణ చేసి న్యాయము యిప్పించ కోరుచున్నాను.

తేదీ                                        అపీలుదారుని సంతకం.

చిరునామా

జి. ఒ. నెం 4458 రు యల్. అండు యమ్. 23 [illegible] 1951.

షెడ్యూలు 1. రూలు 13. (1) ఎన్నికకు నిలబడ్డ ప్రతి సభ్యునకు ఒక్కొక్క బాలట్టుబాక్సు (వోటిచ్చు కాగితంవేయు పెట్టె) యుండవలెను. అందుపై సర్కిలుపేరు నెంబరు లేక రెండున్ను వ్రాయవలెను. ఒక్కొక్క పెట్టెపై ఒక్కొక్కరి ఫోటోయున్ను అది లేనిపక్షమున ఏదైన ఒకరంగుగాని అదిలేని పక్షమున ఒకగుర్తుగాని ఏర్పాటు చేయవలెను.

వివరము :—ఫోటోలను ఎన్నికకు నిలబడ్డవారు ఎన్నిక రోజుకు ముందుగా తగినంతగడువుతో ఎలక్షను ఆఫీసరునకు పంపుకోవలెను.

15. (1) బాలట్టుపేపరు (వోటిచ్చుకాగితం) ఇంగ్లీషులోగాని అక్కడవాడే ప్రధానమాతృభాషలోగాని లేక రెంటితోగాని అచ్చువేయవలెను.

(2) ఎంతమందికి వోటిచ్చు అధికారములుంటే అన్ని వోటు కాగితాలు యియ్యబడును.

17. వోటరు బాలట్టు కాగితముపై ఎవరికి వోటియ్యదలచుకొనునో అట్టివానిపేరు యెదురుగా × గుర్తుపెట్టి ఆకాగితమును వారికొరకేర్పడ్డ గుర్తుగల పెట్టెలో మడతపెట్టి వేయవలెను.

జి. ఒ. నెం 1498 గు రూల్. అండు యమ్. 5 మేయి 1931.

21. వోటరును పోలింగు ఆఫీసరుగాని లేక పోలింగు ఏజంట్లు తెలిపినమీాదటగాని గుర్తుకుగాను ప్రశ్నింపవచ్చును.

(1) ఆ వోటరుపేరు పూరాగా వోటర్లజాబితాదాఖలా చదివి నీవేనా అని ప్రశ్న వేయవచ్చును.

(2) ఇదివరకు ఎక్కడైనా వోటునిచ్చి యిక్కడికివచ్చితివా ?

యీా మొదలైన ప్రశ్నలకు సమాధానం సరిగా లేని పక్షమున పోలింగు ఆఫీసరు బాలట్టుపేపరును యియ్యకుండా వుండవచ్చును.

22. శాసే అను బుజువును అవసరమైన పక్షమున వోటరు చేసుకోవలెను. ఆబుజువుపై పోలింగు ఆఫీసరు వోటు

కాగితము యియ్యవలెను. కాని యిట్టివారివద్దనుండి తీసికొనిన సముజాయిషీ కాగితాలు ఏమైనావున్న వాటిని ఎలక్షను ఆఫీసరుకు పంపవలెను.

జి. ఓ. నెం 4458 రు ఎల్. అండు యమ్. 23 నవంబరు 1931.

18. (1) వోటరు గుడ్డివాడైనను లేక మరేకారణం వల్లనైనా వోటు గుర్తుపెట్టలేనిపక్షమున ఎవరికి తాను వోటిచ్చునో ఆపేరు కెదురుగా పోలింగు ఆఫీసరుచే గుర్తు పెట్టించుకొని పెట్టెలో వేయించుకోవచ్చును. పోలింగు ఆఫీసరు గుర్తుపెట్టునపుడు ఎన్నికకు నిలబడ్డ సభ్యుల ఏజంట్లకు చూపవలెను.

(2) యీరీతిగ వేయు కాగితములకు కారణములు పోలింగు ఆఫీసరు వ్రాసికోవలెను.

20. వోటుకాగితముపై పోలింగు ఆఫీసరు సంతకం (ఇన్‌షియలు) లేనిదే ఆవోటుకాగితం చెల్లదు.

జి. ఓ. నెం 1498 రు ఎల్. అండు యమ్. 5 మేయి 1931.

24. బాలట్టుపేపరు పాడైనయెడల మరొక కాగితం యియ్యబడును.

(ఎ) (1) పోలింగు ఆఫీసరు, అక్కడున్న సిబ్బంది, పోలింగు ఏజంటు మున్నగువారికి వోటుయిచ్చు హక్కున్నవారికి ఎక్కడ వోటుయిచ్చు హక్కుగలదో అక్కడ నిలబడ్డవారికి వోటు యిచ్చుటకుగాను ముందుగా ఎన్నిక ఆఫీసరుకు వ్రాసి అనుమతి పొందినయెడల ఎన్నిక ఆఫీసరు అనుమతి కాగితమును యిచ్చును. ఆ అనుమతి కాగితమున్ను వోటుకాగితమున్ను కలిపి పోలింగు ఆఫీసరుకు యియ్యవలెను.

(2) అట్టి కాగితములను పోలింగు ఆఫీసరు ప్రత్యేక కవరులో ఎలక్షను ఆఫీసరునకు పంపవలెను.

జి. ఓ. నెం 1498 రు యల్. అండు యమ్. 5 మేయి 1931.

19. ఘోషా స్త్రీలు వోట్లిచ్చుటకై ఎలక్షను ఆఫీసరు ప్రత్యేక సౌకర్యముల ఏర్పాట్లు చేయవలెను.

బాలెట్టు పేపరు నమోనా.

నెం 4 రు ఫారము.

| కౌంటరు ఫైలు | జిల్లాబోర్డు | ఓటరు ఫైలు |
|---|---|---|
| వరుస నెంబరు | తాలూకాబోర్డు | సర్కిలు వార్డు |
| | పంచాయితీ | |

జిల్లాబోర్డు
తాలూకాబోర్డు
పంచాయితీ
సర్కిలు లేక వార్డు
ఎన్నిక తేది
వోటర్ల జాబితాలోని పేరు నెంబరు.

| వరుస నెంబరు. | ఎన్నికకు నిలబడ్డవారి పేరు వివరములు. | వోటరు యిష్టప్రకారం ఏ పేరుకైనను ఎదురుగా గుర్తు పెట్టుట. |
|---|---|---|
| 1 | | |
| 2 | | |
| 3 | | |
| 4 | | |
| 5 | | |
| 6 | | |
| | | |




బాలెట్టుపేపరు వెనుక భాగమున వరుస నెంబరుండును.

వివరము :— ఎన్నికకు నిలబడ్డవారి పేర్లకుండే అక్షరములనుబట్టి అకారాదిగా వారిపేర్లు వరుసను ముద్రింపబడును.

వోటునిచ్చు కాలపరిమితి దాటినయెడల వోటు నిచ్చుటకు హక్కుండదు.

జి. ఓ. నెం 1498 రు యల్. అండు యమ్. 5 మేయి 1931.

**2.** (ఇ) వోటుతీసుకొను ప్రదేశమున ఆరోజు 10 గంటల కాలమునకు తక్కువగాకుండా వోట్లు తీసుకోబడవలెను. ఉదయం 7 గంటలు లగాయితు సాయంకాలము 6 గంటల లోపునే వోట్లు తీసుకోవలెను.

షరా :—వోటరు తన నెంబరు జ్ఞాపకం వుంచుకొనిగాని లేక చీటీపై వేసుకొని పోలింగు ఆఫీసరుకు ముందుగా యిచ్చిన వోటు యియ్యడం పని త్వరగా జరుగును.

## సభ్యుల ఎన్నిక.

54 సెక్షను. [ఎన్నుకోబడుటకుండే అర్హతలు.]

(1) ఏ ప్రదేశమునకు సభ్యుడుగా నిలబడునో అచ్చోటకేర్పడ్డ వోటర్లజాబితాలో తన పేరుండవలెను.

(2) గ్రామమునసబుతప్ప మరే గవర్నమెంటు ఉద్యోగియు ఎన్నికకు నిలువగూడదు. గవర్నమెంటునకు సర్వకాలవు

ఉద్యోగిగాగాని, జీతము తీసుకొనుటగాని, రుసుము తీసుకొనుటలో నున్నవారంతా ఎన్నికలకు నిలువగూడదు. గౌరవోద్యోగీయులుగా నున్నవారు ఎన్నికలకు నిలబడవచ్చును.

ఎన్నికకు నిలబడుటకు అర్హత యున్నదో లేదో అను ప్రశ్న ఎన్నికకు ముందుగాని ఎన్నిక అనంతరంగాని వచ్చే పక్షమున దాని పరిష్కారము స్థానిక గవర్నమెంటువారిదై యున్నది. వారిచ్చుతీర్పే ఆఖరు తీర్పుగా నుండును.

వివరము :—ట్రియి యూనియను ఆఫీసరు, మణేదారు గవర్నమెంటు ఉద్యోగీయులక్రిందనే వత్తురు. జీతం తీసుకొనే మ్యునిసిపలు ఛైరుమెన్ గవర్నమెంటు ఉద్యోగి కాబడడు. మైనర్ల ఆస్తిని సంరక్షించుట కేర్పడ్డ మేనేజరు (కోర్టు ఆఫ్ వార్డ్సు) గవర్నమెంటు ఉద్యోగిగా పరిగణింపబడునని ఉన్నది కాని యీవిషయమై అట్టివారు గవర్నమెంటు నౌకరుగాదనే తీర్పులుకూడా నున్నవి.

**55 వ శెక్షను.**

[సభ్యుడుగా నిలచుటకుండే అనర్హతలు.]

(1) క్రిమినల్ కోర్టువారి తీర్పు ప్రకారం ద్వీపాంతరవాసశిక్ష, ఆరు నెలలు దాటిన కారాగారవాసశిక్ష, విధింపబడి ననుభవించుటయు, యీశిక్షను అపీలు కోర్టువారు రద్దుపరచకపోయినను, అట్టి శిక్షను అనుభవించుచుండే కాలములోను శిక్షాపరిమితి పూర్తిఅయిన తేదీలగాయితు అయిదువత్సరములు పూర్తిఅగుపరకును సభ్యుడుగా నిలబడగూడదు.

కాని యిట్టి శిక్షలలో నైతికజీవితమునకు భంగకరము గాని శిక్ష అయినయెడలను, రాజకీయ నేరముగా శిక్షింపబడి నను అట్టి శిక్షకాలములోగాని లేక శిక్ష పూర్తి అయినపిమ్మట గాని సభ్యుడుగా నిలబడుటకు అర్హతను కలిగియుండును.

(2) సభ్యుడుగా నిలబడుటకై దరఖాస్తు చేయు రోజున గాని (నామినేషను పేపరు) ఎన్నిక జరుగురోజునగాని అట్టివానికి

(ఎ) మనస్థిమితం లేకపోవుట (పిచ్చి) చెముడు, మూగ, కుష్టురోగిగా నుండినను,

(బి) దివాలాదారు, ఇన్‌సాల్వెంటుగా తీర్పు చెప్పబడు టకు సంసిద్ధుడుగా నున్నయెడలను, ఆమోదింపబడని దివాలా దారు (సర్టిఫికెట్టుపొందని) ఇన్‌సాల్వెంటు అయియుండి మరల ఆ ఇన్‌సాల్వెన్సీని తొలగించుకొబడినదనే ఉత్తర్వు పొందని పక్షమున అట్టివారు ఎన్నికకు నిలువకూడదు.

(సి) ఏకంపెనీలోనైనా వాటాదారుగాగాక డైరెక్టరుగా నున్నపక్షమున ఆ కంపెనీవారు లోకల్ బోర్డువారితో చేసుకొన్న కంట్రాక్టు అమలులోనున్నను లేక మరేపనినైనను వారికొరకు చేయుచున్నను అట్టివారు ఎన్నికలకునిలువకూడదు.

(1) లోకల్ బోర్డుకు సంబంధించిన స్థిరాస్తికి కౌలు దారుగాగాని అమ్మకములో కొనుటలోగాని, అగ్రిమెంటులో గాని ఇమిడియున్నను

(2) అప్పుగా యిచ్చిన అగ్రిమెంటులోగాని, సొమ్ము య్యవలసినవారికి జామీనుదారు (హామీగా) గానున్నను,

(3) లోకల్ బోర్డ్సు ప్రకటనలు వేయు వార్తాపత్రికల వారుగాని,

(4) వ్యాపారం చేయుటలో క్రయవిక్రయములలో లోకల్ బోర్డువారితో కంట్రాక్టు చేయువానికి వాని కంట్రాక్టు కాలములోగాని పనిజరుగు కాలములోగాని ఏసంవత్సరములోనైనను రు 1500 లకు మించని క్రయవిక్రయములు జరిగించని యెడల అట్టివానికి అందు భాగముగాని బాధ్యతగాని యున్నదని తలచగూడదు.

(సి. సి.) లోకల్ బోర్డుతరఫున జీతమియ్యబడు న్యాయ న్యాయవాదిగాని లేక వ్యతిరేకముగా పనిచేయుచున్న న్యాయవాదిగాని సభ్యుడుగా నిలబడకూడదు.

(డి) లోకల్ బోర్డు నౌకరు, లోకల్ బోర్డు ఎన్నిక ప్రదేశములో పనిచేయు గౌరవమేజస్ట్రీటు, (ఆనరరీ మేజస్ట్రీటు) ఎన్నికకు నిలువకూడదు.

(ఇ) లోకల్ బోర్డులో సభ్యుడుగానుంటూ తన కాల పరిమితి పూర్తికానిదే మరల ఎన్నికకు నిలువకూడదు.

(ఎఫ్) ఎన్నిక తేదీకి లోకల్ బోర్డు సభ్యునియొక్క నౌకరుగాని, యజమానిగాని, క్రింది ఉద్యోగస్తుడుగాగాని, నున్నను ఎన్నికకు నిలువగూడదు.

(జి) ఈ శెక్షనులో 1వ సబుశెక్షనులోనున్న అనర్హతను కలిగియున్నను దానిని లోకల్ గవర్నమెంటువారు తొలగించవచ్చును.

వివరము :—లోకల్ బోర్డు కంట్రాక్టరు సమిష్టికుటుంబములోనివారై యున్నయెడల మిగతావారిలో నెవరైనను సభ్యుడుగా నిలువకూడదు.

ఉచితముగా పనిచేయు న్యాయవాది నిలబడవచ్చును. ఏ కేసులో పనిచేయుచుండెనో ఆ కేసు పూర్తికాగానే ఆ న్యాయవాదికి బోర్డుతో సంబంధం ఉన్నట్లు యెంచబడదు. కాని యీ విషయములో తగాయిదాలు వచ్చుచున్నవి. కేసు పూర్తి అయినవెంటనేగాని ఎన్నికకు నిలచేపక్షమున అంతకు ముందుగాగాని అట్టి బోర్డుకు తాను యికను న్యాయవాదిగా నుండనని వ్రాయుట మంచిది.

అనరరీ మేజస్ట్రీటు తనపదవికి రాజీనామా నిచ్చుటయు అది ఆమోదింపబడిన పిమ్మటగాని ఎన్నికకు నిలువరాదు.

గ్రామపంచాయితీ కోర్టు మెంబరుగా (సభ్యుడు) నున్న వాని కిది వర్తింపదు. అట్టివారు ఎన్నికకు నిలువవచ్చును.

లోకల్ బోర్డు మెంబరుకుగల అధికారపదవినిబట్టి తాను ద్రవ్యలాభము కలుగజేయుటకుగాని నష్టము కలుగజేయుటకుగాని సమర్థుడై యున్నపుడే తనవద్దనున్న నౌకరు, యజమాని, క్రింది ఉద్యోగస్థుడు ఎన్నికకు నిలువరాదనునది వర్తించును.

59 వ శెక్షను. వెనుక పేజీలలో వ్రాయబడియుండెను. యీ శెక్షనుక్రింద శిక్షింపబడినవారు ఎన్నికకు నిలువరాదు,

జి. ఓ. నెం 1498 రు యల్. అండు యం. 5 మేయి 1931.

2. (1) ఎలక్షను ఆఫీసరు 30 రోజులకు తక్కువగాని గడువులో లోకల్ బోర్డ్సు ఆక్టు 11, 11 (ఎ) శెక్షనులప్రకారము

ఇంగ్లీషులోను స్థానికంగావాడే ప్రధానమాతృభాషలోను ముఖ్యమైన వార్తాపత్రికలలో యీ దిగువ వివరములతో ప్రకటన పరుపవలెను.

(ఎ) ఎంతమంది ఎన్నుకోబడవలెను.

(బి) సర్కిలు లేక వార్డులలో వేటికి ఎన్నుకోబడవలెను.

(సి) నామినేషను దరఖాస్తు(సభ్యత్వపుదరఖాస్తు)ఎచ్చోట ఏ తేదీని ఏకాలమున తీసికోబడును అను విషయము 10 రోజులకు ముందుగా ప్రకటన చేయవలెను.

(డి) నామినేషను పేపర్లను తీసికొనిన తరువాత ఎన్నిక తేదీకి 15 రోజులకు ముందుగా వాటిపరిశీలన (స్క్రూటినీ) పూర్తి కావలెను.

(ఎఫ్) వోట్లు ఎపుడు ఏ తేదీని ఎచ్చోట ఏ కాలమున తీసు కోబడునో ప్రచురింపవలెను.

(2) పై ప్రకటన నోటీసు యీదిగువ ప్రదేశములలో ప్రచురపరుపవలెను.

(ఎ) ఎలక్షను ఆఫీసరు ఆఫీసు, ఎన్నికలకు సంబంధించిన బోర్డులందు,

(బి) (1) పంచాయితీలకు వార్డులున్న ఎన్నికజరిగే వార్డులలో మూడుచోట్లలోను వార్డులు లేనియెడల పంచాయితీ గ్రామములో మూడుచోట్లను

(2) తాలూకా, జిల్లాబోర్డు ఎన్నికలకు ఆయా ఆఫీసులలోను తహశ్శీల్దారు సబు మేజస్ట్రీటు, ఆఫీసులలోను

తదితర ముఖ్యప్రదేశములలోను బహిరంగ ప్రచురణ చేయ వలెను.

నామినేషను పేపరు.

3. (1) నెం 1 వ ఫారము పూర్తిచేసి యివ్వవలెను. యీ ఫారములకై ఏవోటరైనను వ్రాతమూలమున ఎలక్షను ఆఫీసరు లేక ఎన్నికలు జరిగే బోర్డు ప్రెసిడెంట్లకు దరఖాస్తు చేసిన ఉచితముగా యివ్వబడును.

(2) ప్రతి నామినేషను పేపరులు ఒకరు ఉపపాదించుట మరొకరు ఆమోదించుట జరుగవలెను.

(3) (ఎ) ఎన్నిప్రదేశములలో ఎన్నికకు నిలచునో అన్ని వేరువేరు దరఖాస్తు ఫారములు యివ్వవలెను.

(బి) ఎన్నికకు నిలబడువారుగాని, వారిని ప్రపోజు, శకండు చేయువారుగాని దరఖాస్తు ఫారములను ఎన్ని ఎన్నిక స్థానములుంటే అన్ని ఫారములున్ను ఎలక్షను ఆఫీసరునకు యియ్యవచ్చును.

(సి) ప్రతి ఎన్నికస్థానమునకు ఒకే దరఖాస్తుగాక వేరే వేరు వోటర్లచే ప్రపోజు శకండు చేయించిన ఫారములు యియ్యవచ్చును.

వివరము :— ప్రతి దరఖాస్తున్ను ఏసర్కిలులో లేక ఏవార్డులో నిలబడునో ఆవార్డు లేక సర్కిలు వోటర్లలో ప్రతి యిరువురిచే అనగా ప్రపోజు శకండు చేయించి ఒకటికి మించిన

ఫారములు యియ్యవచ్చును. వీటివల్ల కలిగే ఫలిత మేమనగా ఒక కాగితములో ఫారబాటున్న మరొకటి పనికివచ్చును.

(4) నామినేషను పేపరు ఎన్నికకు నిలబడువారుగాని, ప్రిపోజు కకండుచేయువా రిరువురు కలసిగాని స్వయముగా ఎలక్షను ఆఫీసరుకు కాలనిర్ణయము లోపుననే యియ్యవలెను.

(5) కాలనిర్ణయ ప్రకారం యియ్యని దరఖాస్తులను ఎలక్షను ఆఫీసరు నిరాకరింపవలెను.

16. ఫిబ్రివరి 1932 ఫోర్టుసెంటు జార్జిగెజట్టు లోకల్ సెల్పు గవర్నమెంటు డిపార్టుమెంటు 155 పేజీ ప్రకారముగా జి. ఓ. నెం 1498 రు 5 మేయి 1931 లో యీదిగువమార్పు 5 వ రూలు 1 వ క్లాజునకు కాబడెను.

5. (1) ఆదిఆంధ్రుడైననేతప్ప మిగిలినవారిలో నామి నేషను పేపరు వేయుటకు ముందుగా రొఖ్ఖముగాని లేక గవర్న మెంటు ప్రామిశరీనోట్సుగాని

(1) జిల్లాబోర్డు ఎన్నికకు ప్రతిసర్కిలునకు ఒకొక్క నూరు రూపాయల చొప్పున

(2) తాలూకాబోర్డు ఎన్నికకు ప్రతి సర్కిలునకు ఒకొక్క రు 50 లు చొప్పున

(3) లోకల్ గవర్నమెంటువారు ప్రచురణరీత్యా సొమ్ము కట్టవలెనని తెలిపిన పంచాయితీ ఎన్నికలకు మాత్రమే ప్రతి వార్డునకుగాని వార్డులు లేనిపక్షమున ప్రతి ఎన్నికస్థానమునకు గాని రు 25 ల చొప్పున డిపోజెట్టు కట్టవలెను.

జి. ఓ. నెం 1498 రు యల్. అండు యమ్. 5 మేయి 1931.

(5) (2) ఎన్నిక అనంతరంగాని ఎన్నికకు సకాలములో నిలుచుట మానినపుడుగాని యీడిపోజెట్టుసొమ్ము తిరిగి ఇత్తురు. ఎన్నికలోపున చనిపోతే వారసునకు ఆసొమ్ము ఇత్తురు.

(3) ఏ ప్రదేశమునకు ఎన్నికకు నిలబడునో ఆప్రదేశములో వోట్లిచ్చిన మొత్తం సంఖ్యలో 8 వ వంతునకు ఎక్కువగా వోట్లు రానిపక్షమున ఆ డిపోజెట్టు యియ్యబడదు. లోకల్ గవర్నమెంటువారు వశపరచుకొనెదరు.

(4) చెడిపోయిన వోట్లుగాక పనికివచ్చిన వోట్లయొక్క మొత్తం సంఖ్యలో 8 వ వంతుకు దాటినదా లేదా అని లెక్క చూడబడును.

(5) తాలూకా జిల్లాబోర్డుకు ఎన్నుకోబడినవారిపేరు జిల్లాగెజిటులో ప్రకటింపబడిన పిమ్మట మెంబరుగా కూర్చొనక పోయినను స్థానిక గవర్నమెంటువారి ఉత్తర్వుతో డిపోజెట్టు సొమ్ము తిరిగి యిత్తురు. యీ తిరిగి యియ్యడములో ఒక ప్రదేశమునకు మించి నిలబడిన పక్షములో అట్టి ప్రదేశములకు గాదగిన వోట్లు వచ్చినవో లేవో చూచి రానిపక్షమున ఆప్రదేశముయొక్క డిపోజెట్టును మినహాయించి మిగతాసొమ్మే యిత్తురు.

6. ఎలక్షను ఆఫీసరు నామినేషను కాగితాలను తీసుకొనిన తరువాత వాటి విమర్శనకై నాడేగాని లేక మరొక తేదీ ఎచ్చోట ఎన్నిగంటలకో నిర్ణయించిననాడే ప్రచురింపవలెను.

జి. ఓ. నెం 4458 రు యల్. అండు యమ్. 23 నవంబరు 1931.

పెడ్యూలు 2.

5. గ్రామములలో జరిగే ఎన్నికలకు ఏవార్డునకు ఆ వార్డునకే వేరువేరు దరఖాస్తులు తీసికోబడును. పంచాయితీకి నిలబడే ఎన్నికదారు ఏవార్డులో నిలబడితే ఆవార్డులో వోటరుగా నుండనక్కర లేదు. ఆగ్రామ వోటర్ల మొత్తం జాబితాలో ఏవార్డులోనున్నను పనికివచ్చును. ప్రపోజరు శకండరు మాత్రం ఏవార్డుకు నిలబడితే ఆవార్డులోనివారై యుండి తీరవలెను.

6. ఎలక్షను ఆఫీసరు లేక ప్రిసైడింగు ఆఫీసరునకు ఎన్నికకు నిలబడినవారిని దరఖాస్తులను గురించి ఆక్షేపణలు ఏవోటరైనను చేయవచ్చును. వాటిని యీదిగువ అంశము లతో ఎలక్షను ఆఫీసరు విచారణ చేయవలెను.

(1) 54, 55, 59 శెక్షనుల ప్రకారం అనర్హుడనిగాని

(2) ప్రపోజరు, శకండరు పేర్లు వోటర్లజాబితాలో లేని పక్షమున

(3) ఆదిఆంధ్రులకుగాని లేక తదితరులకుగాని ప్రత్యేకింపబడిన సర్కిలు లేక వార్డులకు దరఖాస్తు చేసియున్నను తోసివేయవచ్చును.

3. ఇట్టి విచారణలు ముందు తేదీలకు వాయిదా వేయక నాడే పూర్తి చేయవలెను.

జి. ఓ. నెం 1498 రు యల్. అండు యమ్. 5 మేయి 1931.

8. (ఎ) ఎలక్షను ఆఫీసరు విచారణ జరిగిన 4 రోజుల లోపున ఆయాబోర్డుల ఆఫీసులలోను తన ఆఫీసులోను ఆమోదింపబడిన పేర్లు ప్రకటనపరుపవలెను.

(బి) యీపేర్లు అకారాదిగ ప్రకటింపబడవలెను.

9. ఎన్నికకు నిలువనివారు తమపేర్లను ఎన్నికకు నిం చిన దరఖాస్తుల విచారణ తేదీకి పూర్వమురోజు మధ్యాహ్నం 3 గంటలకు వ్రాతమూలమున తెలుపవలయును. వ్రాసినపిమ్మట మఱల వుంటానని వ్రాస్తే వప్పుకోరు.

10. (1) ఎన్నిక స్థానములకు సరిబడ్డ దరఖాస్తుఫారములు వచ్చిన అట్టివారంతా ఎన్నుకోబడినట్లుగా ఎలక్షను ఆఫీసరు ప్రకటించవలెను.

(2) ఎన్నిక స్థానములకు సరిబడ్డ సంఖ్యకు తక్కువ సంఖ్యగల దరఖాస్తులు వచ్చినను అట్టివారంతా ఎన్నుకోబడినటుల ఎలక్షను ఆఫీసరు ప్రకటింపవలెను. మిగిలిన స్థానములకు వేరే ఎన్నికలకు యథావిధిగా కార్యక్రమమంతయు జరిగించవలెను.

16-2-32 న ఫోర్టుసెంటుజార్జిగెజటులో యీ జి. ఓ. ను గుఱించి జరిగిన మార్పు ప్రకారంగా——

11. (2) నామినేషను దరఖాస్తులు తీసికొనిన పిమ్మట వోట్లు తీసుకొను తేదీకి ముందుగాగాని పిమ్మటగాని ఏదరఖాస్తుదారైనను చనిపోయినయెడల మరల నూతనముగా ఎన్నికల కొఱకు జరగవలసిన కార్యక్రమమంతయు జరిపితీరవలెను.

## నామినేషను ఫారము నమోనా.

### నెం 1 రు ఫారము.

1 పేరు లేక నెంబరు $\frac{\text{సర్కిలు}}{\text{గ్రామము}}$ / వార్డు

2 దరఖాస్తుదారుని పూర్తిపేరు

3 వోటర్లజాబితాలోనున్న నెంబరు

4 తండ్రి లేక కర్నవాన్సు (గార్డియను) లేక భర్తపేరు

5 వయస్సు

6 పురుషుడా లేక స్త్రీయా

7 కులము

8 వృత్తి, చిరునామా.

9 ఉపపాదకుని పూర్తిపేరు (ప్రిపోజరు)

10 వోటర్లజాబితాలో ఉపపాదకుని నెంబరు

11 ఉపపాదకుని సంతకం

12 ఆమోదకుని పూర్తిపేరు

13 వోటర్లజాబితాలో ఆమోదకుని నెంబరు

14 ఆమోదకుని సంతకం

నేను తెలియపరచేదేమనగా

నేను $\frac{\text{బ్రిటిషు రాజ్యమునకు సంబంధించినవాడను}}{\text{హిందూ దేశములోని ఇస్టేటుకు సంబంధించినవాడను}}$

నేను ఎన్నికకు నిలబడుటకు ఇష్టపడుచున్నాను.

దరఖాస్తుదారుని సంతకం.

దీని దిగువననే ఎలక్షను ఆఫీసరు ఆమోదము మీూదిగువ రీతిగా నుండును.

వరుస నెంబరు

ఈ దరఖాస్తుదారు నాఎదుట వల్ల
వోటున తేదీ గంటలకు
దాఖలు చేయబడియుండెను.

ఎలక్షను ఆఫీసరు లేక ఆయనతరఫుననున్న
ఉద్యోగి సంతకం.

వోట్లు లెక్కించుట.

జి. ఓ. నెం 1458 రు యల్. అండు యమ్. 23 నవంబరు 1931.

7. గ్రామపంచాయితీ ఎన్నికలలో వార్డులున్న ఏవార్డునకు ఆవార్డుకున్ను లేనియెడల గ్రామమొత్తంమీూదను ఎన్నికలు జరిపి వెంటనే ఫలితమును ప్రచురింపవలెను.

11. వోట్లలో సమానసంఖ్య వస్తే లాటరీమీూద ఆఎన్నికను నిర్ధారణ చేయవలెను.

27. ఎలక్షను ఆఫీసరు ఎన్నికకు నియమించిన కాల నిర్ణయ ప్రకారం సభ్యులఎదుటగాని వారితరఫు ఏజంట్లఎదుట గాని వోట్లు లెక్కపెట్టవలెను.

29. (2) ఒకేవోటరుకు పొరబాటున రెండు వోట్లకాగితాలిచ్చిన ఆవోట్లు రెండుగాగాక ఒకటిగానే లెక్కకువచ్చును.

27. (బి) ఏకారణంచేతనైనా వోటు లెక్కలోనికి తీసుకోబడని పక్షమున అట్టి కాగితాలపై కారణములను వ్రాసి నిరాకరింపవలెను.

(ఇ) ఒకరోజున లెక్క పూర్తి కాకపోతే మరుసటి రోజుకు వాయిదా వేయవచ్చును. కాని అందుకు సంబంధించిన కాగితాలను పెట్టెలో పెట్టి సీలు వేయవచ్చును.

ఎన్నిక ఆఫీసరు సభ్యులు లేక వారితరఫు ఏజంట్లు వాటిపై సీళ్లు ఎవరివి వారు వేసుకోవచ్చును.

జి. ఒ. నెం 1498 రు యల్. అండు యమ్. 5 మేయి 1931.

20. (1) వోటుయొక్క గుర్తు పేరునకు ఎదురుగా లేకపోయినను ఎందరికి వోటుయిచ్చు హక్కున్నదో అన్ని గుర్తులేగాక ఎక్కువ గుర్తులు పెట్టినను ఆకాగితం లెక్కకు రాదు.

(2) పేరుకు ఎదురుగా ఎన్ని గుర్తులు పెట్టినను ఆ కాగితం పనికివచ్చును.

(3) రెండుపేర్లకు చెందినట్లుగా గుర్తు పెట్టిన ఆవోటు లెక్కలోనికి రాదు. ఆ కాగితములో సరిగా పెట్టిన మరేగుర్తు అయినను లెక్కకు వచ్చును.

28. (ఎ) ఎక్కువవోట్లు వచ్చినవారిని ఎన్నుకోబడినటుల ప్రచురింపవలెను.

33. సరిసమానంగా వోట్లువస్తే వారికి తెలిపినపిమ్మట లాటరీమీద నిశ్చయం చేయవలెను.

32. (1) కొన్నివార్డులు లేక కొన్నిసర్కిళ్లకు ఒకే సభ్యుడు ఎన్నుకోబడినయెడల అట్టివారు ఏవార్డునకు లేక సర్కిలుకు తాను ఎన్నుకోబడినటుల నిశ్చయం చేయవలెను. ఆవివ

రము వ్రాతమూలమున ఎన్నిక ఫలితమును తెల్పిన 24 గంటల లోపున తెలుపవలెను.

(2) అటుల తెలుపకపోతే ఎలక్షను ఆఫీసరే తనకు తోచిన వార్డు లేక సర్కిలు నిర్ణయించి మిగిలినవాటికి ఎన్నికలు జరుపుటకు ఉత్తర్వు చేయును.

34. (1) జిల్లాబోర్డు ఎన్నికల ఫలితమును ఎలక్షను ఆఫీసరే ఫోర్టుసెంటుజార్జి గెజటునకు ప్రచురణకై గవర్నమెంటు ప్రెస్సు సూపరెంటెండెంటునకున్ను

(2) తాలూకాబోర్డునకు పంచాయితీబోర్డునకు జిల్లా గెజటునందున్ను ప్రచురణకు పంపవలెను.

(3) అన్నిబాపతుల ఎన్నికల ఫలితము ఏఎన్నికకు సంబంధించిన ఆఆఫీసులో నోటీసు బోర్డుకు కట్టవలెను.

35. ఎన్నికాధికారి ఎన్నికల ఫలితమును తెలిపినపిమ్మట ఎవరైనను వదలుకొంటానని వ్రాతమూలమున తెలిపినయెడల తర్వాత ఎవరికి వోట్లు హెచ్చువచ్చిన వారినే ఎన్నుకోబడునటుల ప్రచురింపవలెను, యిదేప్రకారం ఒకే సభ్యుడు కొన్ని వార్డులు లేక కొన్ని సర్కిళ్లకు నెగ్గినచో తాను 32 రూలు 1వ క్లాజు ప్రకారం తెలిపినయెడల మిగతాచోట్లలో అతని తర్వాత హెచ్చువోట్లు వచ్చినవారు ఎన్నుకోబడినటుల ప్రకటింపబడును.

16-2-1932 ఫోర్టుసెంటుజార్జిగెజటులో లోకల్ సెల్ఫుగవర్నమెంటు డిపార్టుమెంటు 161 పేజీ.

35. (1) ఎన్నికలను గురించిన తగవు ఏదైనావచ్చిన దానినిగురించి లోకల్ గవర్నమెంటువారికి వ్రాసి తెలిసికోవలెను. వారి ఉత్తర్వు ప్రకారం జరుగవలెను.

(2) ఎన్నికలు నిలుపుచేయుట జరిగించుటకు సంబంధించిన తగవులలో ఏస్థితిలో ఆపుచేయవలెననునది లోకల్ గవర్నమెంటువారి ఉత్తర్వునుబట్టి జరిపించవలెను.

(3) లోకల్ గవర్నమెంటువారి ఉత్తర్వు లేనిదే ఎన్నికలు నిలుపుచేయుట ఫలితమును తేల్చుట ఆపకూడదు.

జి. ఒ. నెం 1498 రు యల్. అండు యమ్. 5 మేయి 1931.

28. (బి) ఎన్నికకు నిలబడిన సభ్యులుగాని వారితరఫు ఏజంట్లుగాని వోట్లు లెక్కతేల్చి ఫలితమును నిర్ణయించిన నె 9 రు ఫారమునకు నకలు ఎలక్షను ఆఫీసరువద్ద తీసుకోవచ్చును.

జి. ఒ. నెం 4458 రు యల్. అండు యం. 23 నవంబరు 1931.

31. (1) ఎన్నికల ఫలితమును తేల్చినపిమ్మట అందుకు సంబంధించిన కాగితాలన్నిటిని సీలుచేసి వాటిని ఎలక్షను ఆఫీసరువద్ద వుంచవలెను. వాటిని కావలెనని అడిగే అధికారులకే వాటిని యియ్యవలెను.

(2) ఎన్నికలకొఱకు ఉపయోగించిన వోటర్లజాబితాను (గుర్తుపెట్టిన జాబితా) పై కాగితాలతోసహా ఎన్నికాధికారి ఏడాదివఱకు దాచవలెను. అటుపిమ్మట వాటిని పారవేయవచ్చును. పారవేయకూడదనే ఉత్తర్వు అట్టి ఉత్తర్వు యిచ్చు అధికారినుండి వచ్చినపక్షమున వాటిని ఉంచవలెను.

నెం 9 రు ఫారము.

జిల్లాబోర్డు
తాలూకాబోర్డుల ఎన్నికల ఫలితమును తెలుపు పట్టిక.
పంచాయితీబోర్డు

| ఎన్నికలకు నిలిచిన సభ్యుల పేర్లు. | పనికివచ్చిన వోట్ల సంఖ్య. |
|---|---|
| ఎ | |
| బి | |
| సి | |
| డి | |
| ఇ | |
| ఎఫ్ | |
| పనికివచ్చిన మొత్తం వోట్లు. | |
| పనికిరాని మొత్తం వోట్లు. | |

నేను ఇందుమూలముగా తెలియపరచేదేమనగా

యీ దిగువ సభ్యులు

సర్కిలు
గ్రామం
వార్డు

| | | |
|---|---|---|
| ఎ. | ప్రత్యేకింపబడిన స్థానమునకు | కులము / స్త్రీ |
| బి. | ప్రత్యేకింపబడిన స్థానమునకు | కులము / స్త్రీ |
| సి. | ప్రత్యేకింపబడిన స్థానము | కులము / స్త్రీ |

డి.
ఇ. } ప్రత్యేకింపబడని స్థానములకు ఎన్నుకోబడిరి.
ఎఫ్.

ఎలక్షను ఆఫీసరు సంతకం.

**57** వ శెక్షను.

[సభ్యులు అనర్హతలను గుఱించిన విషయము జిల్లా జడ్జిచే తీర్మానింపబడవలెను.]

(1) 54 వ శెక్షను 1 సబుశెక్షను, 55, 56, 59 శెక్షనుల క్రింద అనర్హుడైతాను ఆఅనర్హతను గుర్తించకపోయినను 56, 59 శెక్షనుల క్రింద అనుమానము తోచినను, లోకల్ బోర్డు ఏజిల్లాలోనున్నదో ఆ జిల్లాజడ్జికి ఏమెంబరైనను దరఖాస్తు పెట్టుకోవచ్చును. లేదా 56, 59 శెక్షనుల క్రింద ప్రెసిడెంటు కోరితే దరఖాస్తు చేసుకోవలెను.

(2) జిల్లాజడ్జి అగత్యమని తోచిన విచారణ చేసిన పిమ్మట 54 వ శెక్షను 1 వ సబుశెక్షను 55, 56, 59 శెక్షనుల క్రింద అనర్హుడైనది లేనిది నిర్ణయించి తీర్పు చెప్పవలెను. యీ తీర్పే అంత్యపరిష్కారమగును.

(3) జిల్లాజడ్జి తీర్పుచెప్పువఱకు మెంబరుగా నున్నవారు తన మెంబరు పదవికి సంబంధించిన పనులను నిర్వర్తించుచుండ వచ్చును.

వివరము :—సభ్యులుతప్ప వోటర్లు పిటీషను (అర్జీ) పెట్ట కూడదు. దీనికి కాలదోషం లేదు. జిల్లాజడ్జి తీర్పుపై ఇండియా గవర్నమెంటు 107 సెక్షను ప్రకారం సివిలు ప్రొసీజరుకోడ్డు 115 సెక్షను ప్రకారం హైకోర్టునకు పునర్విమర్శన పొందగలదు.

56 వ సెక్షను. (4) ప్రకారం తన సభ్యత్వమును తిరిగి కలుగ జేయవలెనని యీ 57 వ సెక్షనుక్రింద కోర్టువారికి దరఖాస్తు చేసుకోవచ్చును.

జి. ఓ. నెం 3792 రు లోకల్. అండు మున్సి. 12 అక్టోబరు 1931.

(1) ఎన్నికలకు నిలబడిన సభ్యుడుగాని, ప్రెసిడెంటుగాని, వైసు-ప్రెసిడెంటుగాని, నిలబడువాని ఎన్నికను గురించిన తగాయిదాను ఎన్నికలకు నిలచిన సభ్యులుగాని లేక ఏ వోటరుగాని ఎలక్షను కమీషనరునకు అర్జీపూర్వకముగా పెట్టుకోవలెను.

(2) (ఎ) ఎలక్షను కమీషనరుగా ఆ లోకల్ బోర్డు ఏరియాలో (ఆవరణ) నున్న సబార్డునేటు జడ్జిగాని అట్టి సబార్డునేటు జడ్జీలలో ప్రిన్సిపలు (ప్రధాన) జడ్జీగాని

(బి) సబార్డునేటు జడ్జి లేని పక్షమున జిల్లాజడ్జిగాని యుండును.

2. ఎన్నికలు పూర్తిఅయిన తర్వాతను, సభ్యులపేర్లను ప్రచురించిన పిమ్మటను 14 రోజులలోపున అట్టి అర్జీలను పెట్టు కొని 1908 సివిలు ప్రొసీజరుకోడ్డు ప్రకారం వాదించుకో వచ్చును.

4. ఇట్టి తగాయిదా పిటీషనులకు పంచాయితీల ఎన్నికల కైతే రు 50 లున్ను తదితర ఎన్నికలకైతే రు 200 లున్ను కోర్టులో హామీగా నుంచవలెను.

7. (1) ఎలక్షను కమీషనరు అనుజ్ఞలేనిదే వీరివద్ద పెట్టిన ఎన్నికల తగాయిదా పిటీషను రద్దుచేసుకోగూడదు.

10. ఎలక్షను కమీషనరు యీదిగువవాటిలో దేనిని నమ్మినను

(ఎ) గెలుపొందిన సభ్యుడు లేక అతని ఏజంటు లేక అతనితరపు మరెవరైనా వోట్లుకొలకు ప్రచారంచేసినవారుగాని 58వ శెక్షనులో వివరించినటుల ప్రవర్తించినను లేక ఇండియా పినల్ కోడ్డు 9. ఎ. ప్రకరణలోనున్నటుల ప్రవర్తించినను

(బి) గెలుపొందిన సభ్యుడు యీదిగువ అంశములలో

(1) 56వ శెక్షను ప్రకారం అనర్హుడైనను, ఇండి యాపినల్ కోడ్డు 9. ఎ. ప్రకరణరీత్యా శిక్ష ఖాయపడి అనుభ వించినను

(2) వోటరుకు వోటిచ్చుటకై రాకపోకల సౌక ర్యము చేసినను, లంచము యిచ్చినను, యిస్తానని నమ్మించి నను,

(3) వోటర్ల కొంటకు అద్దెకుగాని, ఎరువుగాగాని, పడవ, బళ్లు, మున్నగు నేసౌకర్యములు చేసినను,

(4) వోటర్లకు త్రాగుడు లేక మత్తు పదార్థములను సప్లై చేసినను

(సి) నామినేషను కాగితాలలో పొరబాట్లున్నను కోర్టు వారికి తగినట్టి ఋజువైన ఎలక్షను రద్దుకాబడవలెను.

వోటరుకు వోటియ్యకుండా అడ్డుతగులుట, భోజనసదుపాయములు చేసినట్లు ఋజువైన ఎన్నిక రద్దు కాబడవలెను.

56 వ శెక్షను. (1) (ఎ) 55 వ శెక్షనులో వివరింపబడినట్టి నేరము నకున్ను

[మెంబరుగా (సభ్యుడుగా) నుండకుండుటకు అనర్హతలు.]

(బి) 55 వ శెక్షను 2 (ఎ)లో వివరించినటులను,

(సి) 55 వ శెక్షను 2 (బి)లో వివరించినటులను,

(డి) 55 వ శెక్షను 2 వ సబుశెక్షను (సి) క్లాజుయొక్క నిబంధనలకు లోబడకుండా నున్నట్టియు,

(డి. డి.) 55 వ శెక్షను (సి. సి) అంశములున్ను,

(ఇ) 55 వ శెక్షను (డి) అంశములున్ను.

(ఎఫ్) వేరే ఏ మెంబరు క్రిందనైనా పనిలోగాని ఉద్యోగరీత్యాగాని యుండియున్నను,

(జి) 52 వ శెక్షను (డి) (ఇ) క్లాజుల ననుసరించినను,

(హెచ్) ఆఖరున హాజరైన మీటింగు తేదీలగాయితు వరుసను మూడు నెలలలో జరిగిన సాధారణ సభలకు (జనరల్

బాడీ) హాజరు కానిఎడలను మూడు నెలలలోపున రెండు సభల కన్న తక్కువ జరిగినపుడు ఆఖరున హాజరైన సాధారణసభ తర్వాత జరిగిన రెండుసభలకు హాజరు కానియెడలను అయితే యీ ఆజ్ఞను ననుసరించి జరిగిన సభలకు తగిన నోటీసు యివ్వనపుడు వ్యతిరేకముగా లెక్కకురాదు.

ఉదహారణము:—1-10-30 జరిగిన సభకు హాజరయ్యెను. యీసభ సాధారణసభ అయినాసరే ప్రత్యేకసభ అయినాసరే 1-1-31 లోపున జరిగిన ఆర్డనరీ సభలకు హాజరు కాలేదు. గాన యీ తేదీతో సభ్యత్వము పోయినదనే అర్థము.

ఒకవేళ 1-10-30 నుండి 1-1-31 మధ్య ఒక ఆర్డనరీ మీటింగు జరిగినదనుకొనుడు. ఆస్థితిలో అతని ఉద్యోగము పోవదు. మూడు నెలలు దాటినతర్వాత జరిగిన రెండవ మీటింగునకు హాజరు కానిపక్షముననే సభ్యత్వముపోవును. మూడు నెలలలో సభ అసలే జరుగదనుకొనుడు తర్వాత జరిగిన రెండు సభలకు హాజరు కాకపోతే సభ్యత్వము పోవును. దీనిలో ఏ సభకు హాజరైనను సభ్యత్వము పోనేరదు. అనగా మూడు నెలలో రెండు సాధారణ సభలుగాని ఎక్కువగాని జరిగిన-నో మూడుమాసముల అనంతరం పోవును. మూడు నెలలలోపున రెండు మీటింగులు జరిగిన-చో రెండవ మీటింగు జరిగిననాడే పోవును.

2 వ షెడ్యూలు 3 వ నిబంధన 2 ఉపనిబంధన ప్రకారముగా అదేదన (3) (1) పంచాయితీసభకు సభ జరుగురోజుకు ముందుగా కనీసము మూడు పూర్తిరోజులు గడువున్ను, తా

లూకా, జిల్లాబోర్డు సభలకు సభ జరుగురోజుకు ముందుగా కనీ సము పది పూర్తిరోజులు గడువుతో ఏరోజున ఎక్కడ ఏసమ యమునకు ఏపనులను నిర్వర్తించుటకు జరుపబడునో అను వివర ములు కలిగిన నోటీసు యిచ్చియుండినగాని సభ జరుపకూడదు.

(2) అత్యవసర సమయములలో పై నిబంధన ననుస రింపక ప్రెసిడెంటు తక్కువగడువుతో నోటీసునుయిచ్చి సభను జరుపవచ్చును.

4. (1) ఒక లోకల్ బోర్డుయొక్క ప్రెసిడెంటు అప్ప టికి బోర్డునందున్న సభ్యులలో మూడవవంతుకు తగ్గియుండకుండా నున్నంతమంది వ్రాతమూలమున బోర్డు సభను ఫలానా తేదీని ఫలానా చోట ఇన్నిగంటలకు ఫలానాపనికై జరుపవలసినదిగా నోటీసును, ప్రెసిడెంటు లేక శక్రటరీ లేక మేనేజరు లేక ఆఆఫీసు పనిచూచు మరెవరికిగాని (హేండుగు మస్తా) యిచ్చిన ఆప్రకా రము ప్రెసిడెంటు మీటింగును జరుపవలెను.

ఇట్టి రిక్విజిషను (మెంబర్ల కోరికపై) మీటింగు పంచా యితీకైన 10 రోజులు గడువు, తాలూకా, జిల్లాబోర్డులకైన 15 రోజులు గడువు ఉండితీరవలెను.

(2) ఇట్టి రిక్విజిషనుమీద ప్రెసిడెంటు 48 గంటల లోపల అందు తెలిపినరోజునగాని లేక ఆరోజు జరిగినపిమ్మట మరి మూడురోజులకుగాని సభను పిలువవలెను.

అటుల ప్రెసిడెంటు పిలువనియెడల 3 వ నిబంధనలో 1 వ ఉపనిబంధన ననుసరించి రిక్విజిషను ఇచ్చిన సభ్యులంతా కలసి ఇతర సభ్యులకు నోటీసు యిచ్చి సభను జరుపవచ్చును.

(3) 1, 2, ఉపనిబంధనలో వివరించిన రిక్విజిషను మీాటింగులు బోర్డు ఆఫీసునందే జరిపితీరవలెను.

(2) (1) వ సబు శెక్షనుయొక్క (ఎ) క్లాజులో ఏది యున్నను అది వర్తించదని స్థానిక గవర్నమెంటువారు ఉత్తర్వు ఇయ్యవచ్చును.

(3) 1వ, సబుశెక్షను (ఎ) క్లాజు ననుసరించిగాని 59 వ శెక్షను ననుసరించిగాని సభ్యుడుగా నుండుట నిలిచిపోవుటయు, యీా శెక్షనునందు వివరింపబడ్డ శిక్షనుగురించిన కేసు అపీలు మీాదనో రివిజనుమీాదనో రద్దు అయినయెడలను లేక శిక్షచే కలుగబడిన అనర్హతను లోకల్ గవర్నమెంటువారు రద్దుపరచినను, తాను ఎన్నుకోబడ్డ కాలనిర్ణయము పూర్తికాకుండా నున్నపక్షమున ఆ మిగతా కాలమువరకు సభ్యుడుగా నుండవచ్చును. ఒకవేళ యీా మధ్యకాలమున యీాతని ఖాళీలో మరెవరినైనా పూర్తిచేసినయెడల అట్టివారు ఖాళీచేసి వెళ్లిపోవలసినదే అగును.

(4) 1వ సబుశెక్షనులో (హెచ్) క్లాజు ననుసరించి సభ్యుడుగా నున్నవానికి వెంటనే ప్రెసిడెంటు ఆవిషయమును అట్టి సభ్యునికి వ్రాతమూాలమున తెలిపి ఆవిషయమును గురించి ముందు జరిపే బోర్డు సభకు పెట్టవలెను. ఆ సభ్యుడు తిరిగి బోర్డులో చేర్చుకోవలెనని వ్రాతమూాలమున బోర్డు సభజరుగులోపునగాని లేక తనకు నోటీసు అందిన 15 రోజులలోగాని దరఖాస్తు పంపినయెడల సభవారు అతనిని మెంబరుగా తిరిగి చేర్చవచ్చును. సభవారికి యిష్టము లేకపోతే సభ్యత్వము

పోవలసినదే అగును. దరఖాస్తు బోర్డుకు పెట్టకుండా 57 వ శెక్షను ప్రకారం కోర్టువారికి పెట్టుకోవచ్చును. బోర్డుకు, కోర్టుకు మాత్రం పెట్టకూడదు. దేనికో ఒక్కదానికే పెట్టవలెను.

అయితే యిట్టి అవాంతరము తన సభ్యత్వ కాలపరిమితిలో రెండుసార్లకన్న ఎక్కువసార్లువచ్చిన చేర్చుకోబడకూడదు.

వివరము :—ఈ విషయును ప్రెసిడెంటు మెంబరుకు తెలుపకపోతే 211 శెక్షను ప్రకారం శిక్షాపాత్రుడగును. యీ రీతిగా మెంబరు పదవిని కోల్పోయిన ప్రెసిడెంటు వైసు-ప్రెసిడెంటు అయినను వారి అధికార పదవులు కోల్పోయినవారవ్వేదరు. తిరిగి అట్టివారిని చేర్చుకొన్నను వారి అధికార పదవులు మాత్రం చెందనేరవు. వీటికి మఱల ఎన్నికలు జరుపవలసినదే అగును.

11 వ శెక్షను.
[సభ్యుల కాలపరిమితి.]

(1) మూడు వత్సరములుండును, నవంబరు 1వ తేదీ ప్రారంభమై మఱల ఆనవంబరు 1వ తేదీ మధ్యాహ్నముతో అంతమగును.

(2) మధ్య ఖాళీ అయినయెడల అట్టివి ముందు రాగల ఆగస్టు, సెప్టెంబరు నెలలలో జరుపవలెను. కాని లోకల్ గవర్నమెంటువారు సెప్టెంబరు ఆఖరున ఎన్నిక జరుపవచ్చునని తెలుపవచ్చును.

(3) ఖాళీ స్థానములలో మధ్యజరిగే ఎన్నికల కాలపరిమితి అసలు ఎన్నిక కాలపరిమితి ఎంతవఱకుండునో అంతవఱకే నుండును.

(4) ఖాళీ స్థానముల ఎన్నిక త్వరలో అది జరుపు అధికారివల్ల పూర్తిచేయబడవలెను.

అయితే ఆఖాళీ సభ్యుడు హాజరగుట లేనిపక్షమున మూడునెలల అనంతరమే పూర్తిచేయబడవలెను.

(5) మూడవ సబురులే వర్తించును.

11 వ శెక్షను. (1) [ఒక ఎన్నికలో మెంబరు ఎన్నుకోబడనప్పుడు చేయవలసినపని.]

11 వ శెక్షను ప్రకారం ఆకస్మికముగాగాని లేక సాధారణముగాగాని వచ్చిన ఖాళీలో మెంబరుగా ఎవరు ఎన్నుకోబడని పక్షమున ఎన్నికను నిర్ణయించిన అధికారి ఆ ఎన్నికను పూర్తి చేయుటకు మఱల మరొక తేదీ ఏర్పాటు చేయవలెను.

(2) అట్టి మరొక ఎన్నికలోకూడ ఎవరున్ను ఎన్నుకోబడనిఎడల లోకల్ బోర్డువారు ఆఖాళీని పూర్తి చేయుటకై ఎన్నికల విధుల ననుసరించి అర్హతగల నెవరినైనను ఎన్నుకోవచ్చును.

(3) అట్టి సభ్యుని కాలపరిమితి ఆఖాళీస్థానమెంత కాలపరిమితితో ఆఖరగునో ఆకాలముతో పాటే యీఖాళీలో ఎన్నుకోబడ్డవాని కాలపరిమితికూడ పూర్తిఅగును.

వివరము :— ఎన్నుకోబడిన తేదీలగాయితు 3 వత్సరములుగాక ఖాళీలో ఎన్నుకోబడ్డవారు అసలు 3 వత్సరముల కాలపరిమితిలో ఎన్నుకోబడ్డ తేదీకి ఎంత కాలపరిమితి మిగిలియుంటే అంతవఱకే వుందురు.

# ప్రెసిడెంటు వైసు-ప్రెసిడెంట్ల ఎన్నిక.

**12 వ శెక్షను.** ప్రతి లోకల్ బోర్డును తమ మెంబర్ల లోనుండి తామే ఒకరిని ప్రెసిడెంటుగాను మరొకరిని వైసు-ప్రెసిడెంటుగాను ఎన్నుకోవలెను.

[లోకల్ బోర్డుల ప్రెసిడెంటు వైసు-ప్రెసిడెంట్లు.]

వివరము :—ప్రెసిడెంటుగా ఎన్నుకోబడినవారికి మంచి లక్షణము లుండవలెను. తాను వ్యవహరించు ఆస్తిని జనసామాన్యమంతటికి ఉపయోగపడునట్లును, జనసామాన్యములలో రాజకీయసాంఘిక విద్యలను వెదజల్లుటకు, సామర్థ్యమున్నవారినిన్ని, స్వార్థపరుడు, స్వకులాభిమాని, సోమరి, చిరాకు, పరాకు, గర్వము మున్నగు దుర్లక్షణములు లేనివారినిన్ని సభాకార్యక్రమమును సమయములలో కుశాగ్రబుద్ధి ధీరత్వమున్నవారినిన్ని ఎన్నుకోవలెను.

జి. ఒ. న 3471రు యాల్. అండు యమ్ 21 సెప్టెంబరు 1931.

1. (1) ప్రెసిడెంటు వైసు-ప్రెసిడెంటు ఎన్నికకు ప్రత్యేక మీటింగు జరుపవలెను. అట్టి మీటింగు బోర్డు ఆఫీసునందే జరుపవలెను.

జి. ఒ. నెం 583 రు యాల్. అండు యమ్. 13 ఫిబ్రవరి 1932.

(2) జిల్లా కలెక్టరువల్ల జిల్లాబోర్డు ప్రెసిడెంటు ఎన్నిక తాలూకాబోర్డు ప్రెసిడెంటు ఎన్నిక జిల్లాబోర్డు ప్రెసిడెంటుచే నియమింపబడిన మెంబరువల్ల పంచాయితీబోర్డు ప్రెసిడెంటు

ఎన్నిక తాలూకాబోర్డు ప్రెసిడెంటువల్ల నియమింపబడిన మెంబరువల్ల జరుగవలెను. వైసు-ప్రెసిడెంట్లున్నవారు ప్రెసిడెంటుగా నిలబడకపోతే వారే జరుపవచ్చును.

ఇట్టి ఎన్నికల మీటింగు నోటీసులు తాలూకా జిల్లా బోర్డులకు 15 రోజుల గడువున్ను పంచాయితీలకు 5 రోజులు గడువున్ను యుండవలెను.

జి. ఓ. నెం 3471 రు యల్. అండు యమ్. 21 సెప్టెంబరు 1931.

3. ప్రెసిడెంటు ఎన్నికను వైసు-ప్రెసిడెంటు ఆ ఎన్నికకు పోటీచేయని పద్ధతిని తానే జరుపవచ్చును. వైసు-ప్రెసిడెంటు ఎన్నికకు నిలచేపక్షమున ఆ ఎన్నికకు నిలువని మరే మెంబరునైనను తాత్కాలిక ప్రెసిడెంటుగా ఆసభకు ఎన్నుకొని ప్రెసిడెంటు ఎన్నిక జరుపవలెను. వైసు-ప్రెసిడెంటు ఎన్నికను ప్రెసిడెంటు జరుపవచ్చును. ప్రెసిడెంటు ఆమీటింగునకు హాజరు కానిపక్షమున మెంబర్లలో నొకరిని ప్రెసిడెంటుగా ఏర్పాటు చేసుకొని ఆ ఎన్నికను జరుపవచ్చును.

2. ప్రెసిడెంటు వైసు-ప్రెసిడెంట్ల ఎన్నికకు అట్టివారిని ఒక మెంబరు ఉపపాదించుట మరొక మెంబరు ఆమోదించుట జరుగవలెను.

3. (1) అట్టి ఎన్నికలకు ఒక్కరైతే వోట్లు తీసికొనక్కరలేదు.

(2) ఇరువురుగాని అంతకుపైసంఖ్యగాని నిలబడినఎడల హాజరైన సభ్యులలోనుండి వోట్లు తీసుకోవలెను.

4. అట్టి ఎన్నికకు నిలబడేవారిపేర్లను ఇంగ్లీషునగాని స్థానికంగా వాడే ప్రధానమాతృభాషలోగాని అచ్చు వేయించియో, టైపు చేయించియో, సైకిలుస్టైలు తీయించియో ప్రతి సభ్యునకు వోటుకొరకియ్యవలెను.

సమోనా ఫారము.

| పేర్లు. | వోటుకు గుర్తు. |
|---|---|
| 1 | |
| 2 | |
| 3 | |
| | |

ఇట్టి కాగితముపై అందున్న పేర్లలో ఇష్టమున్న పేరు కెదురుగా x గుర్తుపెట్టి మడతపెట్టి బాలట్టుబాక్సులో వేయవలెను. వోటు చేయలేని సభ్యునికి ప్రెసిడెంటు సహాయం చేసి గుర్తు పెట్టవచ్చును. అనగా పేర్లన్ని చదివి ఏపేరున కెదురుగా గుర్తుపెట్టమంటే అచ్చోటపెట్టి అక్కడున్న సభ్యులకు చూపి బాలట్టుబాక్సులో వేయవలెను.

బాలట్టుబాక్సులోని వోటు కాగితాలను యీదిగువ నియమములతో లెక్కపెట్టి ఎన్నిక ఫలితమును తేల్చవలెను.

(1) ఇద్దరైతే అందు ఎవరికి ఎక్కువవోట్లు వస్తే వారి నిన్ని సరిసమానంగా వస్తే సభ్యులందరి ఎదుట లాటరీమీద నున్ను నిర్ణయింపవలెను.

(2) ఇరువురికి మించియుంటే తక్కువవోట్లు వచ్చిన వానిని తొలగించి మఱల వోట్లు సభ్యులందరివద్ద యథాప్రకారం తీసికోవలెను. అందరికి సరిసమానంగా వోట్లు వచ్చినా యిద్దరికి బాగా తక్కువ వోట్లు వచ్చినా ఆ తక్కువ వచ్చిన వారిలో ఎవరిని తొలగించేది సభాధ్యక్షుడు తన కాస్టింగు వోటుతో (తనకున్న అధికపు వోటుతో) తొలగింపవచ్చును. యీరీతిగా క్రియకు యిరువురు సభ్యులే మిగులువరకు తక్కువ వోట్లు వచ్చినవారిని తొలగించుచు ఎన్నికలు జరుపుచుండవలసినదే. యీపద్ధతితో ఆఖరుకు తేలిన ఇరువురిలో ఎవరికెక్కువ వస్తే వారుగాని లేక సమానంగావస్తే లాటరీమీదగాని ఫలితం తేల్చవలెను.

5. ఎన్నికకు నిలబడినవారిలో కొంతవఱకు పాల్గొని పిమ్మట వదలుకొన్నను అట్టివారు ముందు జరిగే ఎన్నికలో పాల్గొనుటకు హక్కుండును.

6. ఒక్కనికన్న ఎక్కువ గుర్తును పెట్టిన ఆ కాగితము పనికిరాదు.

7. ఎన్నిక ఫలితమును జిల్లాబోర్డుకు పోర్టుసెంటుజార్జి గెజటునకు తాలూకా, పంచాయితీ బోర్డుకు జిల్లాగెజటునకు

పంపించవలెను. (16 ఫిబ్రివరి 1932 ఫోర్టుసెండుజార్జిగెజటు సవరణ రీత్యా.)

8. (1) వోటు కాగితములలో లెక్కకు పనికివచ్చినవి రానివి వేరువేరుగా కట్టకట్టి అందుపై వివరములను వ్రాసి ఎన్ని ఆకట్టలోనున్నవో అను అంకెను తెలుపుతూ వాటన్నిటికి సీలు చేయవలెను.

(2) సీలును విప్పించే అధికారివద్దనుండి ఉత్తర్వు వచ్చు వఱకు వాటిని తీయగూడదు.

(3) ఒక వత్సరంవఱకు జాగ్రత్తపరచవలెను. పిమ్మట పారవేయవచ్చును. లేదా యీలోగా కోర్టువారి ఉత్తర్వు వచ్చినఎడల జాగ్రత్తపఱుపవలెను.

## సభ్యుల హక్కులు.

26 వ శెక్షను. [మెంబరు హక్కులు.] లోకల్ బోర్డు పరిపాలనలో జరిగే అశ్రద్ధపనులను, ఆస్తి పాడుచేయుటను, అందుకు సంబంధించిన ప్రదేశములలో చేయవలసిన పనులను గుర్తించి ప్రెసిడెంటును గమనించు నటుల చేయవచ్చును. అందులకై సూచనలు చేయవచ్చును.

(2) పరిపాలనకు సంబంధించిన విషయములపై ప్రెసిడెంటును ప్రశ్నలు అడుగవచ్చును. తీర్మానము లుపపాదింప వచ్చును.

(3) ప్రతి మెంబరు ప్రెసిడెంటుకు వ్రాతమూలమున తెలిపిన పిమ్మట ఆఫీసు రికార్డులను ఆఫీసుగంటలలో చూడ నీయవలెను. కాని ప్రెసిడెంటు చూడనీయనని సకారణము లతో జవాబియ్యవచ్చును.

34 వ సెక్షను.

[మెంబరు మీటింగులో ఎపుడు పాల్గొనగూడదు]

(1) బోర్డుసభ లేక బోర్డువారిచే నియమింపబడ్డ ఉపసంఘములో సభ్యు నకు ప్రత్యక్షముగాగాని పరోక్షముగా గాని తనకుగాని తన భాగస్తునకుగాని సంబంధించినదిగానున్న చర్యలో పాల్గొనగూడదు.

(2) అట్టిస్థితిలో సభాధ్యక్షుడు అట్టివానిని మీటింగు నుండి ఆచర్య ముగియువరకు గైరుహాజరు కావలెననిగాని చర్యలో పాల్గొనకూడదనిగాని కోరవచ్చును.

(3) సభాధ్యక్షునిని అట్టి మెంబరు ఆక్షేపించేయెడల సభాధ్యక్షుడు సభ్యులను అడిగి వారి తీర్మానానుసారం చేయ వలెను.

44 వ సెక్షను.

[విశ్వాసరాహిత్య తీర్మానము ప్రెసిడెంటు లేక వైసు-ప్రెసిడెంటుపై ఉప పాదించుట.]

(1) ఈదిగువ నిబంధనలకు లో బడి బోర్డుఅధ్యక్షుల ఉపాధ్యక్షుల పై విశ్వాసరాహిత్య తీర్మానమును ఉప పాదింపవలెను.

(ఎ) ఆరోజుకు సంబంధించిన ఎజండాను (కార్యక్రమము) చర్చించుటకు పూర్వమే యిట్టి తీర్మానం ఉపపాదించు టకు బోర్డువారి అనుమతి పొందవలెను.

(బి) అనుమతికోరు సభ్యుడు వ్రాతమూలముగా సభాధ్యక్షునికి యిచ్చి అనుమతి పొందవలెను.

(2) సదరు అనుమతి నోటీసును సభాధ్యక్షులు చదివిన పిమ్మట అందుపై వోటు తీసుకోవలెను. బోర్డు మొత్తం సంఖ్యలో మూడవవంతుకు అధనంగా సభ్యులు ఆమోదించని ఎడల ఆ అనుమతి నోటీసు వీగిపోయినదగును. మూడవవంతుకు ఎక్కువమంది సభ్యులు ఆమోదించిన ఎడల ఆ తీర్మానమును గురించి చర్చ జరుపుటకు తేదీ కాలనిర్ణయం సభాధ్యక్షులు చేయువలెను.

(ఎ) అట్టి తేదీ కాలనిర్ణయము తాలూకా, జిల్లాబోర్డుకైనఎడల 10 పూర్తిరోజులుకు తక్కువ గాకుండగను, 15 రోజులకు ఎక్కువగాకుండగను

(బి) పంచాయితీబోర్డు అయిన ఆరు పూర్తిరోజులకు తక్కువగాకుండగను 15 పూరారోజులకు ఎక్కువగాకుండగను నియమింపవలెను.

(3) ఇట్టి తీర్మానమునకు నిర్ణయించిన కాలనిర్ణయప్రకారం చర్యకుతెచ్చి, చర్యకై 3 గంటల కాలపరిమితి ఇయ్యవలెను. ఆ కాలనిర్ణయములో చర్య ముగిసినను లేకపోయినను వోటు తీసుకోవలెను. అంతేనేగాని మరొక తేదీకి వాయిదా వేయకూడదు.

(4) (ఎ) బోర్డు మొత్తం సంఖ్యలో ⅔ వంతు సభ్యులు విశ్వాసరాహిత్య తీర్మానమును (మూడింట రెండువంతులు) ఆమోదించిన పక్షములో ప్రెసిడెంటు లేక వైసు-ప్రెసిడెంటు

తన పదవికి వెంటనే రాజీనామా నియ్యవలెను. లేనియెడల వెంటనే ఖాళీచేసినట్లే ఎంచబడును.

(బి) ఆసభలో ఇట్టి తీర్మానం సెగ్గక వోడిపోతే మరల యిట్టి తీర్మానము ఒక నెలరోజులు గడచిన పిమ్మట పైనిబంధ నల ననుసరించి తేవచ్చును. అపుడు సెగ్గినను ఖాళీ చేయవలసి నదే అగును.

వివరము :—విశ్వాసరాహిత్య తీర్మానము ప్రెసిడెంటు పైను-ప్రెసిడెంటుయొక్క-దుర్నడతలనుబట్టియు పక్షపాతములు నవలంబించినపుడు, స్వార్థముగా లబ్ధిపొందునపుడు పెట్టవలెను.

# ఎన్నికకు నిలబడ్డ సభ్యులుగాని వారితరఫు పనిచేయు ఏజంట్లుగాని గమనింపవలసిన అంశములు.

జి. ఒ. నెం 1498 రు యల్. అండు యమ్. 5 మేయి 1931.

11. (1) పోలింగు ఆఫీసరు తాను పనిచేయు పోలింగు స్టేషనులో వోటున్నచో అట్టిచోట పనిచేయుటకు అనర్హు డగును.

12. పోలింగు ఆఫీసరు పోలింగు స్టేషనులో అందుకు సంబంధించిన సిబ్బందిని తప్ప వేరే ఇతరులను ఉంచకూడదు. ఎన్నికలకు నిలబడిన సభ్యులు వారితరఫు ఏజంట్లు వోటర్లను గుర్తించుటకు ఏర్పడ్డ అధికార్లుండవచ్చును.

**13.** వోట్లు తీసికొనుటకు ముందుగా ఖాళీ బాలేట్టు బాక్సులను అందరికి చూపి అటుపై వాటికి సీళ్లు వేయవలెను. వాటి తాళంచెవులకు వేరే సీళ్లు వేయవలెను.

25. వోట్లు తీసుకొను కాలనిర్ణయము ముగియగానే పోలింగు ఆఫీసరు సీళ్లువేయు ప్రతిసీలుప్రక్కను ఎన్నికకు నిలచిన సభ్యులుగాని వారితరఫు ఏజంట్లుగాని వారిసీళ్లను వేసుకోవచ్చును.

27. వోట్లను లెక్కించుట కేర్పాటుచేసిన రోజునకు వెళ్లి తమ సీళ్లను పరిశీలించుకొనవలెను.

వివరము :— వోటిచ్చువారికి వారి నెంబరు చీట్లపై వేసి పోలింగు ప్రదేశమునకు వెళ్లకుండగానే ముందుగా యిచ్చిన యెడల త్వరలో వోట్లిచ్చుటకు వీలుండును.

అనుమానమున్న వోటర్లను గురించి పోలింగు ఆఫీసరుకు తెలుపవచ్చును.

ఎన్నికకు నిలబడ్డవారు తాము చేయబోవు కార్యమును గురించి కరపత్రములమూలమునను, బహిరంగసభల నేర్పాటు చేసి అందు ఉపన్యాసములిచ్చియు వోటర్లకు తెలుపుట ముఖ్యకర్తవ్యమై యున్నది. లోపాయికారీగా లంచాలుయిచ్చియు మోమోటముపెట్టియు వోట్లు సంపాదించడము నైతిక, రాజకీయ ధర్మము కానేరదు.

---